సంపుటి: 3 1979

# అభ్యుదయ

చందా రు.12

సంచిక: 11, 12. నవంబరు, డిసెంబరు

□ □ □ □ □ □ □ □ □ □ □ □ □ □ □ □ □ □ □ □ □ □

"అనాధులు, అనామకులు
విరాస్తిపరులు,
తలమ్మో కొనవలసిన వాళ్ళు,
చాలా చాలా బలగం నాది,
బలవత్తర బలగంనాది."

"ఎర్రరకత్తుల ధర్మచక్రం
ఎగిరివస్తుంది!
కరువు తెచ్చిన కర్రికుక్కల
తరుమ వస్తుంది!"

– పసుపులేటి

# అభినందనం

## వేమనపై డాక్టరేట్



హైదరాబాదు నానక్ రామ్ భగవాన్ దాస్ కాలేజ్ లెక్చరర్ శ్రీ ఎన్. గోపాల్ (గోపి) వేమనపైచేసిన పరిశోధనకు ఉస్మానియా విశ్వవిద్యాలయం డాక్టరేట్ ఇచ్చింది.

శ్రీ గోపాల్ ఈ పరిశోధనలో దాదాపు 80 రాతప్రతుల్ని పరిశీలించారు. వీటిల్లో కెల్లా అతి ప్రాచీనమైనది. 1691 నాటి రాతప్రతి.

ఈ రాత ప్రతుల ఆధారంగా వేమన కాలం 1650గా శ్రీ గోపాల్ నిర్ణయించారు. 'వేమన పద్యాల్లో చిత్రితమైన సామాజిక వ్యవస్థ 17వ శతాబ్దానికి చెందిన ఆయన అభిప్రాయం. మొత్తం అన్ని ప్రతుల్లోనూ కామన్‌గా ఉన్న 50,60 పద్యాలను సేకరించి, వాటి వెలుగులో శ్రీ గోపాల్ పరిశోధన చేశారు.

□ — □

## సోమసుందర్‌కు 'నెహ్రూ అవార్డు'

"వజ్రాయుధం" కావ్యకర్త, ఆం.ప్ర.అ.ర.సం. అధ్యక్ష వర్గ సభ్యుడు శ్రీ ఆవంత్స సోమసుందర్‌కు సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు లభించింది.

ఆంధ్రప్రదేశ్‌లో అభ్యుదయ సాహిత్యోద్యమ నిర్మాతల్లో శ్రీసోమసుందర్ ఒకరు. ఈయన కళాకేళిఅనే సాహిత్య పత్రికను పిఠాపురం నుంచి ప్రచురించారు. కవిత్వం ఒక్కటే కాక శ్రీ సోమసుందర్‌కు అనేక సాహిత్య ప్రక్రియల్లో ప్రవేశం ఉంది.

□ — □

## రా.రా.కు అకాడెమీ అవార్డ్

ప్రముఖ విమర్శకుడు శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డి వ్యాససంకలనం "సారస్వత వివేచన"కు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి ప్రకటించింది

శ్రీ రారా "సవ్యసాచి" సంవేదన పత్రికల ద్వారా చేసిన సాహితీసేవ తెలుగునాట అందరికీ తెల్సినదే శ్రీ రారా చాలా గ్రంధాలను తెలుగులోకి అనువదించారు కూడా. ఆయన కథా సంకలనం "అలసిన గుండెలు" కధా సాహిత్యంలో ముఖ్యస్థానాన్ని ఆక్రమించింది.

శ్రీరారా మొదటినుండి అభ్యుదయ సాహిత్యోద్యమంతో గాఢంగా పెన వేసుకు పున్నవ్యక్తి. ప్రస్తుతం ఆయన ఆంప్ర అరసం అధ్యక్ష వర్గ సభ్యులు



## హనుమచ్ఛాస్త్రి, ఆనందారామం, కాశీవిశ్వనాథ్ లకు అకాడెమీ బహుమతులు

1979 సంవత్సరానికి శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి కవిత "కీర్తి తోరణం"కు డా॥ ఆనందారామం నవల "తుఫాన్"కు, శ్రీ కాశీ విశ్వనాథ్ ఏకాంకిక "ఒక దీపంవెలిగింది"కి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి ప్రకటించింది.



## శ్రీ శ్రీ కి అవార్డ్

మహాకవి శ్రీ శ్రీకి, శ్రీ పి.వి. రమణయ్య రాజా ఏర్పాటు చేసిన "రాజా లక్ష్మి, ఫౌండేషన్" బహుమతి రూ 10,000 1979 సంవత్సరానికి గాను లభించింది.



వీరందర్నీ ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం తరఫున

అభ్యుదయ అభినందిస్తోంది

# జనవరిలో ఖమ్మంలో ఈ దశాబ్ది నవల సదస్సు

# నిర్వహణకు సన్నాహాలు

రాష్ట్రస్థాయిలో "ఈ దశాబ్ది సాహిత్యం" సదస్సుల నిర్వహణకు సంబంధించిన వందలాది మంది సాహితీవేత్తలు అభ్యుదయ సాహిత్యాభిమానులు చూపుతున్న ఉత్సాహం ఆదరాభిమానాలకు అరసం వినమ్రంగా కృతజ్ఞతలు తెలుపుతోంది

సదస్సుల నిర్వహణకు అనేక సలహాలు సూచనలు చేస్తూ ఎందరో లేఖలు రాశారు. తమ తమ కేంద్రాలలో సదస్సులకు ఆతిధ్యం ఇవ్వగలమని ఆదరంగా ఆహ్వానించారు. సదస్సులలో పాల్గొంటామని వ్యాసాలు సమర్పిస్తామని వాగ్దానం చేస్తున్నారు.

ఇంత పెద్ద కార్యక్రమం ఎలా అమలు చెయ్యాలా అని నిర్వాహకుల్లో మొదట్లో ఏర్పడిన కొద్దిపాటి బెరుకుని ఈ ఉత్సాహం పటా పంచలు చేసింది.

రాష్ట్ర అరసం కార్యవర్గ నిర్ణయం మేరకు తొలిసదస్సును "ఈ దశాబ్ది తెలుగు నవల"పై 1980 జనవరి ఆఖరు వారంలో ఖమ్మంలో జరిపేందుకు నిర్ణయమైంది. ఖమ్మం జిల్లా అరసం కార్యవర్గం అక్టోబరు 7న కౌముది అధ్యక్షతన సమావేశమై సంతోషంతో ఈ బాధ్యతను స్వీకరించింది. అక్టోబరు 21న కిన్నెర హోటల్‌లో దాదాపు 50 మంది జిల్లాలోని ముఖ్యుల సమక్షంలో డాక్టర్ గోర్కి అధ్యక్షతన ఆహ్వానసంఘం కూడా ఏర్పడి చురుకుగా కృషి చేస్తోంది. యువ నవలా రచయిత జాతశ్రీ ప్రధాన కార్యదర్శిగా గల ఈ సంఘంలో కౌముది, హీరాలాల్ మోరియా, డా॥ నాగినేని భాస్కరరావు, రావెళ్ళ వెంకట రామారావు, డా॥అప్పారావు, డా జయచంద్రరెడ్డి, డా రాధాకృష్ణరావు, సి హెచ్ శేషయ్యలు అధ్యక్షవర్గంగా ఉన్నారు. అంకితం కేశవులు, చావలిరామ్మూర్తి పుల్లాబొట్ల వెంకటేశ్వర్లు ప్రత్యూష, దిలావర్, యన్నంరెడ్డి వెంకటరెడ్డి, వేదావన, కిషన్, చంద్రశేఖర్ అజాద్, ప్రభృతులు 18 మంది కార్యవర్గ సభ్యులుగా, వెంకటేశ్వర్లు, పట్టాభి, కుమారి శోభారాణి కార్యదర్శులుగా ఉన్నారు.

ప్రత్యేక సంచిక ప్రచురణలో సమన్వయానికి చేకూరి శ్రీనివాసరావును నియమించారు.

అరసం కార్యదర్శి మల్లిక్ అక్టోబరులో వివిధ జిల్లాలకు వెళ్ళి సదస్సుల నిర్వహణపై కార్యవర్గ నిర్ణయాలను అరసం ముఖ్యులకు వివరించగానే అన్ని చోట్ల

ఊహకు మించిన ఉత్సాహం ప్రకటితమైంది. నిజానికి రాష్ట్రంలో అరసం శాఖ లున్న 13 జిల్లాలూ మరో 10 కేంద్రాలూ అందరూ ఏదో ఒక అంశంపై రాష్ట్ర సదస్సు జరిపేందుకు తమకు అవకాశం యిమ్మని గట్టిగా కోరుతున్నారు. ఇది ఒక రకంగా ఇబ్బందికరంగా కూడా పరిణమించిది. రాష్ట్ర కార్యవర్గం మేరకు ఏడు అంశాలు అనుకున్నాం. అందువల్ల ఏడు జిల్లాలకు మాత్రమే అవకాశం లభిస్తుంది. ఖమ్మంలో ఇదివరకే నవల సదస్సు నిర్ణయమైనందున, ఆ అంశం కావాలని కోరిన ఇతర శాఖలకు అసంతృప్తి కల్గించక తప్పలేదు. అయితే ముందుగా అభ్యర్థన చేసిన వారిలో వరంగల్, విజయనగరం, విశాఖపట్నం, కడప, కాకినాడ, హైదరాబాదు తదితర శాఖలున్నాయి. అయినా ఏ సదస్సు ఎక్కడ ఎప్పుడు జరిపేది, కార్యవర్గ ఉపసంఘం తుది నిర్ణయం చేసి త్వరలోనే ప్రకటిస్తుంది.

అరసం శాఖలు లేనిచోట్లా రాష్ట్రం వెలుపలినుండి కూడా సదస్సుల నిర్వహణకు ఆహ్వానాలు అందాయి. ఉదాహరణకు బెంగుళూరులో పెద్దసంఖ్యలో తెలుగు సాహితీపరులున్నందున అక్కడ ఒక సదస్సు నిర్వహణకు అవకాశం ఇప్పించాల్సిందిగా కోరుతూ అక్కడి మిత్రులు రాశారు.

ఈ ఉత్సాహం అతరాభిమానాలు అరసంకు కొండంత బలం. 1980 సంవత్సరాంతంలోగా సదస్సు ఫలవంతంగా నిర్వహించడానికి వివిధ సాహిత్యాంశాలపై విలువైన పరిశోధనాత్మక, విమర్శన పత్రాలు అతి ముఖ్యం, ఇందులో సాహితీ మిత్రులంతా సహకరించాలని మరోసారి ప్రార్థిస్తున్నాం.

# నవల సదస్సు - ప్రదర్శన

ఖమ్మంలో ఈ దశాబ్దినవలా సాహిత్య సదస్సులో పెద్ద సంఖ్యలో రచయితలు. సాహితీపరులు సాహిత్యాభిమానులు పాల్గొనబోతున్నారు.

ఈ సందర్భంగా ఈదశాబ్దంలో ప్రచురించిన తెలుగు నవలల ప్రదర్శన ఏర్పాటుచేస్తున్నారు. ఈ ప్రదర్శనకు పుస్తకాలు పంపదల్చిన రచయితలు ప్రచురణ సంస్థలు ముందుగా ఆహ్వాన సంఘానికి డా. గోర్కి, గోర్కినర్సింగ్‌హోం, - వైరారోడ్ ఖమ్మం చిరునామాకు తెలపాలి.

సాహితీ చరిత్రలోనే తొలిసారిగా "లిఖిత నవలల" ప్రదర్శన కూడా ఏర్పాటు చేయదలిచారు. అముద్రిత నవలలను కూడా ఇందులో ప్రదర్శించవచ్చును.

నవలా రచయితల ఫోటోల ప్రదర్శన ఈ సదస్సులో మరొక ప్రత్యేక ఆకర్షణ. యువరచయితలు తమ ఫోటోలను పంపాల్సిందిగా కోరుతున్నాం.

విద్యను గురించి

ఆందోళన ఏల ?

— గుర్తుంచుకోండి

# రవి కళాశాల

బ్రాడీపేట :: గుంటూరు

స్థాపితం : **1957**

C. V. N. ధన్ M. A. — డైరెక్టర్

C. ఝాన్సీలక్ష్మి M.A., M. Ed — ప్రిన్సిపాల్

Phones : 20917, 21192, 21545, 24663, 24465.

కథానిక

**వై. వి. యస్. యస్. యన్. మూర్తి**

ఉన్నట్లుండి శిరసపల్లె శివారుల్లో ముత్యాలమ్మ వెలిసింది. ఊరంతా ఈ సంగతే చెప్పుకుంటున్నారు. జనం ముత్యాలమ్మ గూర్చి కథలు కథలుగా చెప్పుకుంటున్నారు. నిన్న మొన్నటి వరకూ సర్పంచ్ కన్నంనాయుడి నమ్మిన బంటు త్రాగుబోతుబైరాగి ఈవేళ అమ్మ వారి నమ్మినబంటు. గడ్డం పెంచాడు. త్రాగుడు మానేశాడు. నిత్యం అమ్మ వారి విగ్రహం దగ్గర పడిఉంటున్నాడు బైరాగి స్వాములవారు అయ్యాడు. "ఒక రోజు రాత్రి బైరాగి త్రాగి స్పృహతప్పి ఈ గ్రామ దేవతను. మీ గ్రామప్రజలు నన్ను నిర్లక్ష్యం చేశారు. అయినా కన్న బిడ్డలన్న మమకారం చంపుకోలేక కవి కరంతో ఇక్కడ దేపడి ఉన్నాను. మహా మారి రాబోతుంది. ఆ మహామారి బారి నుండి నా కన్నబిడ్డలను కాపాడుకోవా లనే వచ్చాను, నాయనా! బైరాగీ! పూర్వజన్మలో నువ్వు నా భక్తుడవు శాపవశాన ఈ జన్మలో ఇలా పతన మయ్యావు. నిన్ను ఉద్ధరించడానికే ఇలా కనిపించాను. నువ్వు నాకు దేవా లయంకట్టి నిత్యం పూజలు జరిపించు.

# గ్రామదేవతలు వర్ధిల్లాలి

ఊరి శివార్లలో చెరువుగట్టున పడిఉన్నా డట. అర్ధరాత్రి బ్రహ్మాండం బ్రద్ద లయినట్లు పెద్ద ప్రేలుడు వినిపిస్తే బైరాగికి మెలుకువవచ్చిందట. ఏముందీ ఎండిపోయిన చెరువుమధ్య నేలరెండుగా విడిపోయిందట. మధ్యలో నుండి విచి త్రంగా మెరుస్తూ ఏదో వెలుగు బయటకు వచ్చిందట బైరాగి ఆ వెలుగును చూడ లేక పోయాడట కళ్ళు చీకట్లు కమ్మి తెలివితప్పి పడిపోయాడట ఎవరో వచ్చి అతడి కళ్ళపై చల్లనిచేత్తో రాసారట కళ్ళు తెరచిచూస్తే ఎవరో దేవతామూర్తి కళ్ళ ముందు నిలచి ఉందట తెలివి తెచ్చుకొని బైరాగి ఆమె కాళ్ళమీద పడ్డాడట. "తల్లీ! ఎవరు నువ్వు?" అని అడిగాడట బైరాగి. "నేనుముత్యాలమ్మను ని పాపాలు పటాపంచలయి పోతాయి. ఊరి ప్రజలందరి చేత కూడా పూజలు చేయించు. ఊరు బాగుపడు తుంది" అన్నదట ముత్యాలమ్మ.

"దండం తల్లీ! నీమాట జవదాటను. కాని తల్లీ! ఉత్తరాన ఉన్న పర్దేశమ్మ మాటేమిటి? అయమ్మను కాదని నీకు పూజలు చేయమంటే జనం ఇంటారా?" అన్నాడట బైరాగి.

"బైరాగీ! ఎంత వెర్రివాడివి పర్దేశమ్మ వేరు నేను వేరు అనుకున్నావా? ఇద్దరం ఒకటే, రెండు రూపాలు. పర్దేశమ్మ రూపంలో ఉత్తరాన కొస్తున్నాను. ముత్యాలమ్మ రూపంతో దక్షిణాన కొస్తున్నాను. మా తమ్ముడు పోతురాజు —వాడి భార్య కూనలమ్మ తూర్పు-పడ

మరలు కాస్తున్నారు. యథావిధిగా అన్ని ప్రక్కలామాకు పూజలు జరగాల్సిందే లేకపోతే ఊరికి రక్షణ లేదు." అన్న దట ముత్యాలమ్మ.

"తెల్సింది తల్లీ! తెల్సింది! కాని తల్లీ! నేను పేదోడిని నా మాటెవరు ఇనుకుంటారు?" అన్నాడట బైరాగి.

"పిచ్చివాడా! చూడు ఊరంతటినీ నీ చుట్టూ ఎలా తిప్పిస్తానో అని అంతర్ధానమయిందట. ఆచోట ఒక విగ్రహం వెలిసిందట. బైరాగి ఆ విగ్రహానికి ఎదురుగా కూర్చున్నాడట కన్నం నాయుడి మనుష్యులు పోయిపిలిచినా బైరాగి పలుకలేదట. అసలు కన్నెత్తి చూడలేదట. బైరాగి పెళ్ళాం-పిల్లలు వచ్చి మొత్తుకున్నా బైరాగి కళ్ళు తెరచి చూడలేదట మాటలాడలేదట భర్తను వదలి ఇంటికి పోలేక బైరాగి పెళ్ళాం పిల్లలతో అక్కడే ఉండి పోయిందట. బైరాగి స్వాములవారు అయ్యాడని ఆ చుట్టు ప్రక్కల జనం చిన్న పాక వేశారు. అక్కడే ఆ పాకలోనే ముత్యాలమ్మ, బైరాగి అతడి భార్యా-పిల్లలు ఉంటున్నారట. మరి రెండు రోజుల్లో ముత్యాలమ్మ గూర్చిన వైనం చుట్టుపక్కల ప్రాకి పోయిందట."

ఇప్పుడు ఎక్కడంటే అక్కడే ముత్యాలమ్మమహాత్యంగూర్చి చెప్పుకుంటున్నారు జనం. గ్రామ మునసబు వీరాస్వామి విధవచెల్లెలు నాంచారమ్మ మీదవాలింది ముత్యాలమ్మ.

"ఊరికి మహామారి వస్తాందిరోయ్! ఊరు వల్లకాడు అయిపోతుందిరోయ్! నా పిల్లా - జెల్లా మహామారికి బలయి తారోయ్! నాకు గుడికడితేనేగాని నేనిక్కడ ఉండలేనురోయ్! నా మాట యినకపోతే ఊరు వల్లకాడు అయిపోద్దిరోయ్! బైరాగి నా భక్తుడురోయ్! ఈడు సెప్పినట్టినుకొని నాకు పూజలు సేయండిరోయ్! నాకు కొలుపులు సేయండిరోయ్! అలా చేస్తాను అని నాకు మాటివ్వండిరోయ్! లేకుంటే నాంచారమ్మను నాలో కలిపేసుకుంటానురోయ్" అది ముత్యాలమ్మ

అంతా లెంపలు వేసుకున్నారు. "వింటాం తల్లీ! వింటాం! నీమాట జవదాటం. నీకు గుడి కట్టిస్తాం! కొలుపులు చేస్తాం! అని మునసబు వీరాస్వామి, సర్పంచ్ కన్నంనాయుడు, అతడితో జనం, ఊరిలో జనం అంతా భక్తితో లెంపలు వేసుకున్నారు. ధూపంవేశారు. హారతిఇచ్చారు. ముత్యాలమ్మ దిగి వెళ్ళిపోయింది. నాంచారమ్మ సొమ్మసిల్లి పడిపోయింది.

ఈ మాటే ఊరంతా చెప్పుకుంటున్నారు. ముత్యాలమ్మ అంటే భయం, భక్తి, గురి కుదురుతూంది ఊరిజనంలో. ముత్యాలమ్మ దర్శనం చేసుకొని తరిస్తున్నారు ప్రజలు. ఇంతలో ఉన్నట్లుండి గొల్లవీరయ్య కాళ్ళు - చేతులు మాటపడిపోయాయి. మళ్ళీ ముత్యాలమ్మ నాంచారమ్మమీద వాలి, వీరయ్యను ముత్యాలమ్మ గుడికి తీసుకెళ్ళి మంత్రపుష్పం పెట్టించమంది జనం వీరయ్యను ముత్యాలమ్మ పాకదగ్గరకు తీసుకొని వెళ్ళారు. అప్పుడే కళ్ళు విప్పిన బైరాగి "అమ్మ పంపిందా!" అని ముత్యాలమ్మ విగ్రహం దగ్గరవున్న

మంత్రజలం తెచ్చి పీరయ్యమీద చల్లాడు. మంత్రప్పుషం చేతిలోనికి తీసికొని అస్పష్టంగా దేవపైశాచిక భాషలో ఏవో మంత్రాలుచదివి పీరయ్య శిరస్సుమీద పెట్టాడు. పీరయ్యకు ఎంతో హాయి అనిపించింది. శరీర మంతా ఏదో కొత్తశక్తి ఆవరించినట్ల యింది ఆతడికి. టక్కునలేచి నిల్చు న్నాడు పీరయ్య. దేవికి దండంపెట్టి నవ్వుతూ – తుళ్ళుతూ అందరితో కలసి వెళ్ళిపోయాడు పీరయ్య. ఇంతేకాదు ఎంతోమందికి ఎన్నో బాధలు నివారిం చింది ముత్యాలమ్మ. అన్నంలేనివారికి అర్ధరాత్రి అన్నం వండిపెట్టింది. ఇలా ఇలా ముత్యాలమ్మ మహత్యం గ్రామ మంతా ప్రాకిపోయింది. పొరుగు గ్రామా లక్కూడా ప్రాకింది ముత్యాలమ్మ మహాత్యం. ఇప్పుడు జనం ముత్యా లమ్మని తలవని ఘడియ ఉండటంలేదు.

o o o

సర్పంచ్ కన్నంనాయుడు ముత్యాల మ్మకు కొలుపులు ఏర్పాటు చేయాల న్నాడు. పంచాయతీ నుండి కొంతడబ్బు, చందాల మూలంగా వచ్చిన డబ్బు ఖర్చు పెట్టి ముత్యాలమ్మకు దేవాలయం, కొలు పులూ జరిపించాలని అతన్ని బలపరచే కమిటీ మెంబర్లు అన్నారు. పంచాయతీలో ప్రతిపక్ష సభ్యులయిన లచ్చిమినాయుడు అచ్చన్న, బుచ్చన్న ఈ తీర్మానాన్ని వ్యతిరేకించారు. "గ్రామదేవత పర్దే శమ్మ ఉండగా మరో ముత్యాలమ్మకు ఎందుకు దేవాలయం కట్టించాలి? కొలు పులు ఎందుకు జరిపించాలి? అయినా కొద్ది రోజుల్లో పంచాయితీ ఎన్నికలు జరగ బోతుండగా ఇంత పెద్ద మొత్తం పంచాయితీనుండి తీసి ఈ నిమిత్తం ఖర్చు చేయడంలో అర్థంలేదు. గత మీటింగులో మేము వీధిలో దీపాలు లేవు, గ్రంథాలయంలేదు, సరిఅయిన రోడ్డులేదు, అప్పర్ ప్రైమరీ స్కూలును హైస్కూలుగా మార్పించమని ఎన్నాళ్ళ నుంచో మొత్తుకుంటున్నాం. దాని విష యంకూడా ఆలోచించమని ప్రతిపాదన చేసి వీటికోసం డబ్బు కేటాయించ మంటే, "ఎన్నికలు ముందుపెట్టుకొని ఈ ఖర్చులు ఎలా? అన్నారు అప్పుడు అలా అని ఇప్పుడు పెద్ద మొత్తంతో దేవాలయం కట్టిస్తామంటున్నారు, కొలు పులు చేస్తామంటున్నారు? ఎన్నికల ముందు ఇవన్నీ ఎందుకు చేయాలి? అంతగా ఇవన్నీ కావాలనుకుంటే రాబోయే పంచాయితీయే చేస్తుంది" అన్నాడు లచ్చిమినాయుడు.

"ఇది దైవకార్యం! దీనికి – దానికి పోలికేమిటి?" అన్నాడు కన్నంనాయుడు.

"మూడు నెల్లక్రితమేగా పర్దేశమ్మకు కొలుపులు చేయించారు ఇంతలో ముత్యాలమ్మకు కొలుపులు ఏమిటి? తరు వాత చేయించ వచ్చుకదా!" అన్నాడు అచ్చన్న

"కొలుపులు చేయించమని అమ్మ వారు చెప్పింది. లేకుంటే మహామారి వచ్చి ఊరును సర్వనాశనం చేస్తుందట" నన్నారు గౌరవ మెంబరుగా విచ్చేసిన మునసబు పీరాస్వామి

"అలా అని ఎవరితో చెప్పిందండి?" అని సవాలు విసిరాడు బుచ్చన్న.

"ముత్యాలమ్మ చాలామందిమీదవాలి

చెప్పింది మన వాంచారమ్మ మీద వాలి చెప్పింది." అన్నాడు సర్పంచ్ కన్నం నాయుడు.

"మన అంటారేమిటి? మా అనండి మరి మా మీద వాలలేదే, మహాత్యా లన్నీ మీ మీ దే చూపించిందిగాని ముత్యాలమ్మ మాకేం చూపించలేదే," అన్నాడు హేళనగా లచ్చిమినాయుడు.

" తప్పు అలా అనకూడదు. కళ్ళు పోతాయి. దేవతనే శంకిస్తే మనకిక పుట్టగతులుండవు. అయినా ఊరిలో రోజురోజుకు నాస్తికత్వం పెరిగి పోతుంది. ఈ సమావేశాల్లో ఈ సమస్య పరిష్కారం కాదు. అందుచేత ఈ సమస్యలను ప్రజలముందు పెడతాం. ప్రజల తీర్పునే శిరసావహిస్తాం." అన్నాడు కన్నంనాయుడు.

o o o

సోదర సోదరీమణులారా! అమ్మ లారా! అయ్యలారా! మనం, మన గ్రామం పూర్వజన్మలో చేసుకున్న పుణ్యం వల్ల ముత్యాలమ్మ మన గ్రామంలో మనల్ని కాపాడడానికి వెలి సింది. తనకు గుడి కట్టించమంది. కొలు పులు చేయించమంది. మేము కూడా గుడి కట్టించాలనే అనుకున్నాం. కొలు పులు జరిపించాలనే అనుకున్నాం కాని గౌరవనీయులయిన పంచాయితీమెంబర్లు కొంతమంది వ్యతిరేకిస్తున్నారు. అందు కని ఆ సమస్యను మీ ముందు పెడు తున్నాను. మీరెలా నిర్ణయిస్తే అలానే చేస్తాం." అన్నాడు కన్నంనాయుడు.

"అమ్మవారికి గుడికట్టించాలి. వేడు కగా కొలుపులు జరిపించాలి" అన్నారు ప్రజలు మూకుమ్మడిగా కేకలు వేస్తూ.

"ఆవేశపడకండి, ఆగండి, లచ్చిమి నాయుడుగారు ఏవో చెప్పాలంటున్నారు. ఆయనచెప్పేది వినడం మనధర్మం. ఆ పైనమననిర్ణయాన్ని తెలియజేయవచ్చు. లచ్చిమినాయుడుగారూ, మీరు మాట్లాడ ండి" అన్నారు కన్నంనాయుడు. లచ్చిమినాయుడు లేచి ప్రజలను ఉద్దేశించి "సోదరసోదరీమణులారా! ఈ విష యాన్ని ఎలా మొదలు పెట్టాలో తెలియ డంలేదు, కాని ఒక్క సంగతి. మేము కొలుపులు జరిపించడానికి గుడి కట్టించ డానికి వ్యతిరేకులంకాదు, కాని పర్దే శమ్మ ఎన్నాళ్ళనుండో మంటపంలో గుడి లేక పడివుండగా, ముత్యాలమ్మకు గుడి కట్టించవలసిన అవసరం ఏమిటి? అందులో పంచాయితీ డబ్బుతో." అన్నాడు.

"ఆమె దేవత. మన అదృష్టంకొద్దీ మన గ్రామంలో వెలిసింది." అని కేకలు వేశారు జనం.

"సరే దేవతే అనుకుందాం, ఒక్క సంగతి నన్ను చెప్పనివ్వండి మొన్న వరదలు వచ్చాయి. గత సంవత్సరం కరువు వచ్చింది. మంచినీళ్ళులేక తిండి లేక, 'అన్నమో, రామచంద్రా' అని జనం అల్లాడిపోయారు. అంతకు క్రితం కలరా - మశూచివచ్చి గ్రామం తుడుచి పెట్టుకుపోయింది. అప్పుడెప్పుడూ వెలికి రానిదేవత ఉన్నట్లుండి ఇంత అర్జంటుగా ఎన్నికలు దగ్గర పడ్డాకే వెలిసింది. అదీకాక తనకు గుడికట్టించమని అందరితో చెప్పలేదు కేవలం సర్పంచ్ గారి మనుష్యులతోనే చెప్పింది.

మహాత్యాలు చూపించదీ ఆయన మనుష్యులకే. ముత్యాలమ్మ పూజారి ఆయన మనిషే! మీరొక సంగతి ఆలోచించండి. అన్నివిషయాలూ అన్నిమహత్యాలు ఆయన వర్గానికే చూపించిన ముత్యాలమ్మ మనకేం చెప్పలేదు కాబట్టి ముత్యాలమ్మ గుడి కట్టించాలని ఆయన కుంటే ఆయనదబ్బుతో కట్టాలి లేదా ఆయన మనుష్యుల డబ్బుతో కట్టాలి గాని మన డబ్బుతో గుడకట్టించాల్సిన పనేమిటి ? " అన్నాడు లచ్చిమి నాయుడు.

జనంలో గుసగుసలు బయలుదేరాయి. అవునని–కాదని రెండు వర్గాలుగా చీలి పోయారు. ఇక కల్పించుకోకపోతే లాభంలేదని, పరిస్థితి విషమిస్తుందని కన్నంనాయుడు "మీకూ ముత్యాలమ్మ మహాత్యాలు చూడాలని ఉంటే తప్పక చూపిస్తుంది. అదెంత సేపు! ఏదో మనకు తెలుసుననుకొని అజ్ఞానంతో మాట్లాడుతాం." అన్నాడు.

నేను అజ్ఞానంతో మాట్లాడడంలేదు. నిజం బయట పెట్టాలనే ప్రయత్నిస్తు న్నాను. సోదర సోదరీమణులారా! ఇదంతా మన కన్నంనాయుడుగారి లీలగా నాకు తోస్తుంది. మేము వెనుకటికి గ్రామానికి విద్యుద్దీపాలు పెట్టించమని, గ్రంథాలయం కట్టించాలని, ఉన్నత పాఠశాల పెట్టించాలని, రోడ్లువేయించాలని, మంచినీటిబావులు తవ్వించాలని అంటే పంచాయితీకి అంత డబ్బులేదు, అయినా ఎన్నికలముందు ఇవన్నీ ఏమిటి? వచ్చేపంచాయితీ పాలకవర్గం చేస్తుందన్నారు. మరి ఈ కొలుపులకు, గుడికి డబ్బు ఎక్కడనుండి తెస్తారు! ఇదంతా జనాన్ని మభ్య పెట్టాలని చూస్తున్నారు. ఎన్నో ఏళ్ళుగా మనఊరికి కన్నం నాయుడుగారే సర్పంచ్. అంతకు పూర్వం ఆయన తండ్రిగారు. ఇక రేపు కన్నంనాయుడుగారికుమారుడు సర్పంచ్ అవుతాడు. అందులో సందేహంలేదు. వారికిదో వారసత్వపుహక్కు. అయితే ఈయన తండ్రిగారి విషయంవదిలేద్దాం ఎందుకంటే ఆయనలేరు. ఇక కన్నం నాయుడుగారు గ్రామానికి ఏం చేశారు? దానికి జవాబు మన ఊరినిచూస్తే ఎవరైనా చెప్పగలరు. మంచినీళ్ళకు బావులులేవు చెరువులపై ఆధారపడి బ్రతుకుతున్నాం. వేసవికాలంలో మనకి నీటికొరత ఎంత ఉందో అందరికి తెలుసు. ఆసుపత్రిలేదు. మనకు రోగాలొచ్చినా చూసేదాతలేడు. మనమంతా ఆచారిగారి మాత్రలపైనే ఆధారపడాలి. పాఠశాలఉంది అది ఏ స్థితిలో ఉంది! మనసర్పంచ్ గారి గొడ్లశాలలాగా ఉంది అక్కడ మాస్టర్లు ఏమి చెప్తున్నారో, పిల్లలు ఏమి నేర్చుకుంటున్నారో తెలీదు. రోడ్లులేవు. దీపాలులేవు. చదువుమీది శ్రద్ధతో చదువుకొనేవాళ్ళకు అవకాశంలేదు. చదువుకోవాలంటే 15 మైళ్ళ దూరానఉన్న పట్టణానికివెళ్ళాలి అక్కడున్న గవర్నమెంటు ఆసుపత్రికి వెళ్ళాలిగాని మరోదారిలేదు. ఇట్టి పరిస్థితుల్లో కొన్ని యేండ్లుగా సర్పంచ్‌గా ఉన్న మన కన్నంనాయుడుగారు మనకేం చేశారో తెలుస్తునేఉంది. ఇటీవల కాలంలో జనం నిజం గ్రహించారు. తమ స్థితిగతులను గమనించారు. సరి

యైన పాలకవర్గాన్ని ఎన్నుకోవాలను కున్నారు. జనం నాడి గ్రహించే రానున్న ఎన్నికల్లో తమపరిస్థితి ఏమవు తుందో గ్రహించే కన్నంనాయుడుగారు జనాన్ని మభ్య పెట్టాలని, తప్పుదారి మళ్ళించాలని ఈ విధమైన కొత్తఎత్తుతో కొత్త ప్రయత్నాలు, సరికొత్త పద్ధతుల్లో చేస్తున్నారనడంలో ఏమీ సందేహంలేదు." అన్నాడు లచ్చిమినాయుడు. జనంలో గుసగుసలు బయలుదేరాయి. అవునని – కాదని వాదులాడుకోవడం ప్రారంభించారు జనం.

కోపంతో కన్నంనాయుడి ముఖం ఎరుపెక్కిపోయింది. ఎంతో నిగ్రహంతో "నా సర్పంచ్ పదవికి ఈ గుడి కట్టించడానికి ఏమి సంబంధమో నాకు అర్థంకావడంలేదు. మేము ఈ గ్రామానికి ఏమి చేశామో! చేయలేదో! ప్రజలకు తెలుసు. అయినా దైవకార్యానికి రాజకీయాలకు ముడి పెట్టడం సమంజసంగాలేదు" అన్నాడు కన్నంనాయుడు.

అప్పటికే ప్రజల్లో రెండు వర్గాలు ఏర్పడ్డాయి. అవునూ – కాదూ! అని వాదులాడు కోవడం, కేకలు వేసు కోవడం, చేతులు కలుపు కోవడం జరిగింది. కేకలు – పెనుగులాట ప్రారంభమయింది. పరిస్థితిని గ్రహించి కన్నంనాయుడు –"ఇప్పటికి విషయం తేలలేదు కాబట్టి రెండునాళ్ళు తీరిగ్గా ఆలోచించుకోండి. ఎల్లుండి ఇదే సమయంలో ఇక్కడే కలుద్దాం. కాని ఒకవిషయం గుర్తుపెట్టుకోండి. ఇదిదైవ కార్యం దీనికీ-రాజకీయాలకీ సంబంధం లేదు. దైవదూషణ మహాపాపం. దానికి ప్రతిఫలం అనుభవించక తప్పదు మీరు ఏమయినా చెప్పుడు మాటలు విన్నారో మహామారివచ్చి ఊరిని ఊడిచిపెట్టుకు పోతుంది. ఊరు వల్లకాడు అవుతుంది. ఆపైన విచారించి లాభం లేదు" అన్నాడు.

ం ం ం

ముత్యాలమ్మ నాంచారమ్మ మీద వాలింది. శివమెత్తి ఆడింది ముత్యాలమ్మ." ఊళ్ళో నాస్తికులు బయలుదేరారోయ్! నన్నేశంకిస్తున్నారు. వాళ్ళు సర్వనాశనమైపోతారు. మీరు వాళ్ళతో కలసిపోతే ఊరును మసి చేసేస్తాను. ఏమనుకున్నారో!" అంది ముత్యాలమ్మ జనం అంతా శాంతింప జేసారు ముత్యాలమ్మను, కొలుపులు జరిపిస్తామని గుడి కట్టిస్తామని. ముత్యాలమ్మ ఓగి వెళ్ళిపోయింది. నాంచారమ్మ సొమ్మసిల్లి పడిపోయింది. రాత్రంతా తెలివి రాలేదు ఆమెకు. జనం అంతా అక్కడే ఉన్నారు.

తెల్లవారేసరికి ముత్యాలమ్మ తన మహాత్యం, చూపించింది. లచ్చిమినాయుడి పశువులకొట్టం, ధాన్యంకుప్పలు పరశురామప్రీతి అయిపోయినవి. బుచ్చన్న చెరువుగట్టున జారిపడి కాలు విరగ్గొట్టుకున్నాడు. అచ్చన్న చిన్న కూతురు లక్ష్మి పాలేరు వెంకడితో లేచిపోయింది. లచ్చిమినాయుడు తగలబడిన తన పాకలదగ్గరకువెళ్ళి తిరిగి వస్తుండగా పోట్లగిత్త నాయుడ్ని కుమ్మేసింది. ఎలాగో చావు తప్పించుకొని బయటపడ్డాడు లచ్చిమినాయుడు. రెండో

రోజుకే ఈ గోరాలు జరిగిపోయాయి. ప్రజల్లో ముత్యాలమ్మను శంకించినందుకు దూషించినందుకే ఈ ఆపదలు కలిగాయని నమ్మకం ఏర్పడిపోయింది. దానితో ప్రజల్లో భయం – భక్తి విపరీతంగా పెరిగిపోయాయి. గ్రామమంతా ముత్యాలమ్మకు మొక్కుతుంది. ఆ వేళ ముత్యాలమ్మ పాకదగ్గర ఎన్ని కోళ్ళు! ఎన్ని మేకలు బలయిపోయినాయో! ఎంత డబ్బుపోగుపడిందో చెప్పడం కష్టం.

ం ం ం

గ్రామం అంతా ముత్యాలమ్మకు గుడి కట్టటానికి ముందుకు వచ్చింది. ఆవేళటి సమావేశానికి అసుపత్రిపాలైన లచ్చిమినాయుడు బుచ్చన్న రాలేదు. సిగ్గు, అవమానంచేత అచ్చన్న రాలేదు. దేవతను శంకించి అవమానించినందుకే వాళ్ళకాశాస్తి జరిగిందని కన్నంనాయుడు ప్రజలను నమ్మించాడు. ఏకగ్రీవంగా గుడి కట్టించడానికి అందరూ అంగీకరించారు, గుడికి 5వేల రూపాయలు తన విరాళంగా కన్నంనాయుడు, 8వేలరూపాయలు తన విరాళంగా వీరాస్వామి ప్రకటించారు. గుడి కట్టడం ప్రారంభమయింది. కొలుపులు బ్రహ్మాండంగా జరిగాయి.

ం ం ం

పంచాయితీ ఎన్నికలు వచ్చాయి. వెళ్ళాయి. పంచాయితీ సర్పంచ్‌గా కన్నంనాయుడు ఏకగ్రీవంగా ఎన్నికయ్యాడు. కన్నంనాయుడి కొడుకు మెంబరయ్యాడు ఈసారి లచ్చిమినాయుడుగాని, అతడి మనుష్యులెవరూ కనీసం మెంబర్లుకూడా కాలేదు. అంతా ముత్యాలమ్మ మహిమ అనుకొన్నారు. కాని నిజం తెలిసిన కన్నంనాయుడు నోరులేని అమాయకపు జనం తెలివిమాలినతనానికి ప్రాణంలేని మట్టిబొమ్మ అండతో తను సాధించిన ఘనవిజయానికి మురిసిపోయాడు. గర్వంగా మీసం మెలివేశాడు. ప్రజల్లో తెలివితక్కువతనం – మూర్ఖత్వం అజ్ఞానం, వర్ధిల్లినంతకాలం గ్రామదేవతలకు వచ్చిన లోటులేదు. గ్రామదేవతలు వర్ధిల్లాలే కాని తనబోటివానికి ఏం లోటు? అనుకున్నాడు కన్నంనాయుడు గర్వంగా.

— ం

---

# ఆశల పుష్పాలు

కష్టాల గొంగళీలు
నీ జీవన లతను
నాశనం చేస్తున్నాయని
వెరగు చెందక.
నేస్తం!
వాటిని ధైర్యమనే గూటితో
బంధించి, జోలపుచ్చు.
అవి రేపు
సుఖాల సీతాకోకలై
ఆశల పుష్పాలను
ఫలవంతం చేస్తాయి చూడు!

— విట్టల ఫణిమిత్ర

# వన్యమృగ సంరక్షణ

— డా॥ చందు సుబ్బారావు

నియంతలు జారిపోతున్నారు
రవంత జాలిజూపండి
ఉరి తాళ్ళతో ఉట్టి కట్టి
ఊరేగిన నేతలు
దారి తప్పి నరరక్తం సేవించిన
శార్దూల భ్రాతలు
కారు మేఘాలవంటి కరుణార్ద్రహృదయులు
కటిక చీకటి బోలు వదనారవిందులు
మూడుకొమ్ములుఆరు కళ్ళు,
ఒళ్ళంతా నాగజెముడు ముళ్ళు।
సృష్టిలో ఇది ప్రత్యేక జీవరాశి
భూమాత భూతదయావారాశి
భవిష్యత్ ప్రపంచం కోరిచూడనేడు
ఈ జీవులను జాగ్రత్తగా కాపాడు।
పూజ్య నియంతలకు పునరావాసం
సమస్యపై శిఖరాగ్ర సమావేశం
వాషింగ్టన్ డి.సీ వారి ఆతిథ్యం
చైర్మన్ హువాగారి అధ్యక్షం
ప్రజావాణిలేని ప్రతిచోటినుండీ ప్రతినిధులు
ఉదాత్త శ్రేయోభిలాషులనుండి ఉదారంగా నిధులు
కార్యదర్శి కరాచీ నుండి ఎన్నిక
ఉపాధ్యక్షులు ఉగాండా నుండిరాక।
సంభ్రమానందల్తో ఉత్సవాలు సంరంభం
విష్కంభ మారణాయుధాల నృత్యం –
ఉన్నత్తత మా పతాక –
ఉర్విలో విషోదయం అగుగాత।
అందుకు మీ అందరి చేయూత।
వన్యమృగ సంరక్షణార్థం
వదాన్యులు కదలుగాత।

# నేటి సోవియట్ సాహిత్య సమాలోచన

—చేకూరి శ్రీనివాసరావు

సోవియట్ సాహిత్యాన్నిగురించి కొంతమంది పాఠకుల్లో కొన్ని అనుమానాలున్నాయి. సోవియట్ సాహిత్యం ప్రయోజనాత్మక దృష్టితో సృష్టించడం వల్ల అది సాహితీ పరిపక్వతనందుకోలేక విసుగును పుట్టించేలావుంటుందనీ గత సంప్రదాయాలను పూర్తిగా విస్మరిస్తుందనీ విమర్శవుంది.

సోవియట్ రచయిత పాక్షికవిద్యాగంధం కలిగినవాడని, పూర్తిగా కెరియరిస్టు అని అంతఃకరణఖైదీ ( Prisoner of conscience ) అని బూర్జువా విమర్శకుల అభిప్రాయం. నిస్సందేహంగా యిది వాస్తవాన్ని గుర్తించకపోవడమే. చాలావరకు సోవియట్‌సాహిత్యం పశ్చిమదేశాల్లో ప్రచురించబడటంవలన ఆ సాహిత్యం గురించి సరైన అవగాహనకు అవకాశంలేకపోయింది.

సమకాలీన సోవియట్ సాహిత్యానికి గత 62 సంవత్సరాలుగా సోవియట్ ప్రజలు దేశ పునర్నిర్మాణంలో పొందుతున్న ఆనందం, ఉత్తేజం, చైతన్యం ఇతివృత్తంగా వుంటున్నది. సాహిత్యానికి సజీవత, వాస్తవికత-పట్టు కొమ్మలని గుర్తించి వాటిని ప్రతిబింబించిన సోవియట్ సాహిత్యాన్ని గుర్తించకపోవడంలో అర్థంలేదు. సోషలిస్టు దేశంలోని రచయిత గత 62సంవత్సరాల సోషలిస్టు విజయాలను ప్రపంచానికి చెప్పాల్సిన అవసరాన్ని గుర్తించడంఅంటే నిజమైన ప్రజాసాహిత్యసృష్టికి అంకితమవడం అన్నమాట. లెనిన్ వూహించినట్లుగా సాహిత్యసృజన-కొద్దిమందివున్న ఉన్నతవర్గంకోసంగాక దేశానికిభవిష్యత్తుకు జీవనాడియైన కోట్లాది శ్రామికుల కోసం సాహిత్యం సృష్టింపబడాలి. ( Not to an upper ten thousand; but to millions and tens of millions of workers who are the flower of the country, who are its strength and its future )

పాఠకుల్లో సోవియట్ సాహిత్యాన్ని గురించీ, రచయిత సృజనశక్తి, స్వేచ్ఛను గురించీ ఈ క్రింది ప్రశ్నలుత్పన్నం కావడం సహజం.

1. సోవియట్ సాహిత్యం ప్రధానంగా దేన్ని గురించి చర్చిస్తుంది?

2. సోవియట్ రచయిత తన రచనను ఏ దృష్టితో చూస్తాడు?

3. సోవియట్ రచయిత ఏ సమస్యల్ని యితివృత్తంగా స్వీకరిస్తాడు?

4. సోవియట్ రచయిత ఏ ప్రయోజకత్వం, ఏ లక్ష్యాన్ని ఆశించి రచన చేస్తున్నాడు?

5. సోవియట్ రచయితకు పూర్తి సృజన స్వేచ్ఛ వున్నదా ?

6. సోవియట్ దేశంలో ఏ రకమైన పుస్తకప్రచురణ జరుగుతుంది? ఏది జరగటంలేదు?

7. సోవియట్‌లోని రచయితల సంఘం ఏ ఆశయాలతో నడుపబడుతుంది?

8. వర్ధమాన రచయితలు ఏ విధంగా రూపు దిద్దబడుతున్నారు? ఎక్కడ?

ఇలాంటి ప్రశ్నలకు ప్రఖ్యాత సోవియట్ రచయితలు వెలిబుచ్చిన అభిప్రాయాలను యిక్కడ పరిశీలించడం ఈ వ్యాసం ముఖ్యోద్దేశం.

ఉత్పత్తివలన సామాజిక సమస్యలు ఎదురవుతాయి. సామాజిక ఆశయాలలో గూడ మార్పు వచ్చి అవి వ్యక్తిమీద కొంత ప్రభావాన్ని కలిగివుంటాయి. సోవియట్ సాహిత్యంలో నిరాశ, నిస్పృహలు కనిపించవు. దీనికి కారణం సోవియట్ సాహిత్యం, కళా-కొన్ని నైతిక సిద్ధాంతాలకు లోబడిఉండడమే. సోవియట్ సాహిత్యంలో సృష్టించబడిన కథనాయకుడు తన వ్యక్తిగత స్వార్థాలకు ప్రతీకగా కనిపించక బ్రహ్మాండమైన ఒక నూతన వ్యవస్థా నిర్మాణంకోసం అతడు నిరంతరం కృషిచేస్తాడు. "Man is to man a friend comrade and brother." అనేది సోవియట్ సాహిత్యానికి, పాత్రపోషణకు మూల సిద్ధాంతంగా వుంటుంది.

సోవియట్ రచయితలకు 'Historical destiney of the people' అనే సిద్ధాంతం మీద అచంచల విశ్వాసమున్నది. దాని కొరకు వారు వారిశక్తినంతా ధారపోశారు. జీవితంయొక్క గతి తార్కికాభివృద్ధిగాని, సోషలిష్టు సాహిత్యంగాని మానవుని నైతిక సిద్ధాంతాలను దిగజార్చక, మూఢనమ్మకాలతో చెడగొట్టక హేతువాదము, వాస్తవము అనే ఆశయాలను ధృవీకరిస్తుంది.

సోవియట్ సాహిత్యం "the doctrine of the good" అనే సిద్ధాంతాన్నిగూడ గుర్తిస్తుంది. మానవుడు, అతని విప్లవయుగాన్ని గురించి తెలుపుతుంది. సోవియట్ రచయితలు సత్యాన్వేషణలో ఊహాత్మక అహేతుక వాదానికి బందీలుగారు. కమ్యూనిస్టు పార్టీనడిపిన సంఘటనాత్మక చరిత్ర, సోవియట్ ప్రజల ఆలోచనల చరిత్రే సోవియట్ రచయితల జీవిత చరిత్ర అయింది. అన్ని అభ్యుదయ కళల్లో లాగే సోవియట్ సాహిత్యంలో గూడ వ్యక్తి ఆనందానికి ప్రాధాన్యత యివ్వడం జరిగింది.

ప్రపంచ కమ్యూనిష్టు దృక్పథం,ఆదేశప్రజల సంప్రదాయాలు, ఆచారాలు భాష,సంస్కృతి, జీవనవిధానము, యివన్ని సోవియట్ ప్రజల జాతీయభావనలోని

అంతర్వాహినులే. సంస్కృతి అనేది అంతర్జాతీయతకు సంబంధించినది. నిజమైన కళాకారుడు తనదేశ సంస్కృతితోపాటు యితరదేశ ప్రజలను, సంస్కృతిని గౌరవించటంలోనే భాసిల్లగలడు. స్వదేశసంస్కృతిని సాహిత్యం ప్రతిబింబించగలగాలి. అలాగే అంతర్జాతీయతా భావాన్నిగూడ కలిగివుండాలి. సోవియట్ ప్రజలకు మాతృమూర్తులిద్దరు. వారిజన్మస్థలం, భాష, సంస్కృతి ఒకతల్లి, మరోతల్లి సోవియట్ రష్యా. ఇలాంటి భావనే సోవియట్ రచయితల్లో కన్పిస్తుంది.

"A poet serves as the identity card of an epoch" అని రసూల్ గమ్జతోవ్ కవిగా తన బాధ్యతను గురించి అంటాడు.

సోవియట్ రచయితలు ప్రజాజీవితాన్నే యితివృత్తంగా ఎన్నుకొని సాహితీ సృజనగావించారు. ప్రత్యక్షంగా వారు చూచిన ప్రజలబాధలు. సమస్యలను మాత్రమే సాహిత్యంలో చొప్పించి వ్యక్తికీ, సమాజానికీ వున్న సంబంధాల్ని చిత్రించారు. ఒకలక్ష్యం, క్రియాశీలత, పోంటపటిమ కలవ్యక్తులనే సాహిత్యంలో కథానాయకులుగా చిత్రించారు. ప్రధానమైన సమకాలీన సమస్యల్నీ, వ్యక్తుల్నీ చిత్రించడం వల్లనే సోవియట్ సాహిత్యంమీద పాఠకులకు అభిరుచికలిగింది.

ప్రతియుగానికీ ఒక అపూర్వ చరితను సృష్టించిన మహావీరులుంటారు, అలాగే ఈ యుగంలోని సోవియెట్ సాహిత్యానికి సిసలైన కథానాయకులు సమరశీల, క్రియాశీల ప్రజలే. క్రియాశీలతగలిగిన ప్రజలే నిజమైన సృష్టికర్తలు, యితివృత్తాన్ని ఏ రచయితపైన బలవంతంగా రుద్దక ప్రత్యక్ష అనుభవంతో అనుభూతిచెంది జీవితచిత్రణ చేసేలా చూడాలి.

"కార్యశీలత కలిగిన వ్యక్తులే నేటి కథానాయకులు" అని ఇగ్నటీడ్వారే ట్స్కీభావం. అలాగే "యితివృత్తాన్ని ఎన్నుకొనేముందు రచయిత తన హృదయ ప్రకంపనలను వినాలి" అని రసూల్గమ్జతోవ్ ప్రకటించాడు.

గ్రామసీమలే నేటి రష్యా ఆవిర్భావానికి పునాదులు. "గ్రామజీవితమే నేటి సోవియెట్ సాహిత్యానికి చక్కనియితివృత్తం. అని ఫ్యోదర్ అబ్రమావ్ అభిప్రాయం. వాసిలీబిలావ్, వాసిలీషుక్షిన్ గ్రామజీవితాన్నే యితివృత్తంగా తీసికొని రచనలు గావించారు. సోవియట్ రష్యా అనాదిగా వ్యావసాయికదేశం కనుక గ్రామీణ జీవితమే సోవియట్ సాహిత్యానికి యితివృత్తం కాగలిగింది. గ్రామజీవితంనుండే నీతిశాస్త్రము, జానపదగాథలు ఆవిర్భవించాయి. ప్రాచీన సాహిత్యం అంతా రైతాంగ సమస్యలమీదనే సృష్టించబడింది. అక్టోబరు విప్లవం తరువాత దేశంలో వ్యావసాయకరంగాన్ని పునర్నిర్మించటంలోనే ప్రజలు శ్రద్ధతీసికోవాలని సోవియట్ ప్రభుత్వం, కమ్యూనిష్టుపార్టీగూడ ప్రకటించింది. ఆ సందర్భంగా రచయితలుగూడ వారి వంతుబాధ్యతను నిర్వర్తించారు.

"స్వేచ్ఛ" అనేపదం సోవియట్ సాహిత్యంలో ఒక ప్రత్యేక అర్థంతో పొందుపరచబడింది. స్వేచ్ఛ దేనినుండి? దేనికొరకు? అనేదానికి సమాధానం చెప్పుకొనేము దు ప్రతి కళాకారుడు తనలోతాను స్వేచ్ఛనమభవించాలి. నిజమైన సృజనాత్మక కళాకారుడిగ రూపొందాలంటే ఆ రచయిత స్వేచ్ఛను కలిగివుండాలి. జాతీయ సాహిత్యావిర్భావానికి లిఖితరూపమైన భాషమాత్రమే ప్రధానంకాదు. ప్రజల మనోభావాలను, శక్తి సామర్థ్యాలను బహిర్గతం చేయగలిగేదే స్వేచ్ఛ. అందుకే " Remove the seal from lips " అని యూరి రిత్‌ఖ్యూ అంటాడు ప్రపంచ పౌరుడుగా రచయిత తన సామాజిక బాధ్యతను, హక్కును చైతన్యంతో గుర్తించడంలోనే కళాకారుని స్వేచ్ఛ ఆవిర్భవిస్తుంది." అని యూరి రిత్‌ఖ్యూ అభిప్రాయపడ్డాడు. ఎవరైతే ఒక లక్ష్యం, సామాజిక బాధ్యతలేకుండ అవధులు లేవి స్వేచ్ఛను ( unlimited freedom ) అంటే అరాచక స్వేచ్ఛను ( Anarchistic freedom ) అనుభవిస్తారో వారు ఉద్దేశపూర్వకంగా మానవాళిని మోసంచేస్తున్న నేరస్తులుగానే పరిగణింపబడతారు. సోవియట్ రచయితలకు వస్తువునెన్నుకోవడంలో కొన్ని ఆంక్షలున్నాయి. అలాంటప్పుడు సోవియట్ రచయితకు సృజనస్వేచ్ఛ ఎలావుంటుంది?!

సోవియట్ శాసనాల్లోనే రచనకు ఏదినిషిద్ధవస్తువో నిర్ణయించడం జరిగింది. ఏ రచయితగూడ యుద్ధాన్ని ప్రోత్సాహించే రచనలుగాని, దేశాన్ని కించపరచే రచనలుగాని, సోవియట్ వ్యతిరేకప్రచారంగాని, సెక్సురచనలుగాని చేయగూడదు. సోవియట్‌లో నిజమైనరచయిత ఎవరూ యిలాంటి మానవతా వ్యతిరేకభావనలను గురించి ఆలోచించరు. కాని బూర్జువా రచయితలు డబ్బు సంపాదనకు తుచ్ఛమైన పేరు ప్రఖ్యాతుల కొఱకు యిలాంటి యితివృత్తాలను, స్వీకరించి రచనలు చేస్తారు. యిలాంటి వాటిపైన ఆంక్షలను విధించడం సోవియట్ సమాజంయొక్క సామాజిక బాధ్యత. ( Social imperative ). ఈ Social imperative అనే పదాన్ని గురించి అనేక అనుమానాలున్నాయి. సోవియట్ దేశంలో Party Secretary ఒక రచయితకు Phone లో నీవు ఫలానా విషయంమీద రచనచేయాలి. అని చెపుతారు - అనే దుష్ప్రచారం వింటే కోపానికి బదులు నవ్వొస్తుందంటాడుయూరి. సోవియట్ సమాజంయొక్క Spiritual needsని సంతృప్తిపరచటమే ' Social imperative ' అనే పదానికి సోవియట్ రచయితలు, కళాకారులు యిచ్చినభాష్యం. సోవియట్ దేశప్రజల జీవితవిధానంతో, రచయితగా తనను కదలించిన విషయం ఐక్యతపొందాలి. సోవియట్ సాహిత్యమంతా కమ్యూనిస్టు పార్టీభావాలతో కూడియున్నది. షోలకోవ్, కాన్‌స్టాంటిన్ సిమనోవ్‌లు కమ్యూనిస్టు రచయితలే. సోవియట్ ప్రజలలో అత్యధికభాగం పార్టీ సిద్ధాంతాలలో విశ్వాసమున్నవాళ్ళే ఈ విషయముకో సోవియట్ రచయితలుగూడ వేరుగాదు.

సోవియట్ రచయితల సమాఖ్య ఒక సృజనాత్మక కళాకారుల స్వచ్ఛంద సంస్థ. రచనను వృత్తిగా స్వీకరించినవారిని ఒక వేదికపై ఐక్యపరుస్తుంది. 1934లో మాక్సిమ్ గోర్కీ సోవియట్ రచయితల ప్రథమ సమాఖ్యను ఏర్పాటు చేశారు ఆ సమావేశంలోనే దాని స్వరూప స్వభావాలు రూపొందించబడ్డాయి. సోవియట్ రచయితల సమాఖ్య ఆ దేశంలోని రచయితలకు, కవులకు, రచన చేయటానికి, దాని ప్రచురణకు అన్ని రకాలుగ సహాయము చేస్తుంది. వృత్తి విషయాలలో సంబంధాలు ఏర్పరచుకొని జాతీయ, అంతర్జాతీయ సాహితీవేత్తలతో విస్తృత పరిచయాలు పెంచుకొంటుంది. సోవియట్‌లోని వర్ధమాన యువ రచయితలకు ఈ సమాఖ్య చేయూతనిస్తుంది.

సోవియట్ రచయితల సమాఖ్య సంస్థాగత నిర్మాణములో రచయితల కార్యనిర్వాహక సంఘము ప్రధాన పాత్ర వహిస్తుంది. తదితర సంఘాలన్నీ దానిచే ఎన్నుకో బడుతాయి. సోవియట్ రచయితల సమాఖ్య అన్నిటికన్నా ఉన్నత స్థాయీసంఘము. అది ప్రతి ఐదుసంవత్సరముల కొకసారి సమావేశ మౌతుంది. చివరి సమాఖ్య 1976 జూన్‌లో సమావేశమైంది. ఈ రచయితల సమాఖ్య కార్యనిర్వాహక సంఘము యొక్క అధీనంలో ఉంటుంది. ప్రతి మహాసభలో రహస్య ఓటింగు పద్ధతిపై దాని సభ్యులనెన్నుకుంటారు. దేశంలోని పదిహేను యూనియన్ రిపబ్లిక్కుల రచయితల సంఘాలయొక్క ప్రతినిధులు ఈ సమాఖ్యలో సభ్యులు.

సోవియట్ రచయితల సమాఖ్యలో రచయిత, కవి, సాహితీవిమర్శకుడు, అనువాదకుడు, నాటకరచయిత, సృజనాత్మకశక్తి వుండి ఒక్క పుస్తకం ప్రచురించిన ప్రతి సోవియట్‌పౌరుడు సభ్యుడుగా వుండవచ్చు. సభ్యత్వము పూర్తిగ ఐచ్ఛికము. రచయితల సమాఖ్యలో సభ్యులుకానిరచయితలు అనేకమంది వున్నారు. రచయితల సంఘం దేశ, విదేశాలలో రచయితల working trips ని organise చేస్తుంది. సోవియట్ రచయితల సమాఖ్యలో ప్రస్తుతం సుమారు 8000 మంది సభ్యులున్నారు.

రచయితలసమాఖ్య రచయితలకు సంబంధించిన ప్రతి విషయాన్ని చూస్తుందా? సోవియట్ దేశంలోని literary fund తో రచనకు సంబంధము కాని విషయములను గూడ పట్టించుకొని ఆ సమాఖ్యలోని సభ్యుడు ఎప్పుడైనా చేతకాని పరిస్థితుల్లో ఆర్థిక ఇబ్బందులలో వున్నయెడల రచయితల సమాఖ్య ఆర్థిక సహాయం చేస్తుంది. ప్రచురణాలయాలనుండి వసూలుచేసిన సొమ్మును, రచయితల సమాఖ్యఏర్పాటు చేసిన సాహిత్యోపన్యాసాలవలన వచ్చిన ఆదాయాన్ని సభ్యుల ప్రవేశ రుసుమును, వార్షిక చందాలను ఈ literary fund కు జమవేస్తారు.

సోవియట్ దేశంలో అతిపెద్దదయిన youth organisation "Komsomol" యొక్క కేంద్రకమిటీ పుస్తక ప్రచురణ సంస్థను నడుపుతుంది. నవల, కవిత్వము

సామాజిక, రాజకీయ సాహిత్యం, విజ్ఞానశాస్త్ర సంబంధమయినవాటిని ఈ సంస్థ ప్రచురిస్తుంది. మహోన్నత వ్యక్తుల జీవితచరిత్రలు ప్రచురిస్తుంది. యువకుల కొఱకు 14 నెల పత్రికలు, వారపత్రికలు ప్రచురిస్తుంది ఆధునిక రచయితల రచనలకు విలువనిస్తుంది. ఈ ప్రచురణ సంస్థలద్వారా షోలకోవ్; ఆస్ట్రోవిస్కీ, షుక్షిన్, బోండరేవ్ మొదలగు రచయితల రచనలు పరిచయం చేయబడుచున్నవి. సోవియట్ ప్రచురణసంస్థలు, విద్యావిలువలు, కళాత్మక నైపుణ్యము శిల్పము కలిగిన విషయ వస్తువుకే ప్రాధాన్యత నిస్తాయి. సంపాదకుని నిర్ణయమే ప్రచురణకు final గాదు. ఆరచయిత రాసిన విషయ వస్తువునుబట్టి ఆయావిషయాలలో నిష్ణాతులైన రచయితలు ఆ వ్రాత ప్రతిని నిష్పాక్షిక వైఖరితో చదివి అభిప్రాయాన్ని తెలిపిన పిమ్మటే దానిని ప్రచురణకు అంగీకరించటం జరుగుతుంది. సమీక్షకులు ప్రచురణసంస్థలో సభ్యులుకారు. సామూహిక అభిప్రాయాన్నిబట్టి ఒక రచనను అంగీకరించటమో తిరస్కరించటమో జరుగుతుంది. పాఠకుడే ఆ రచన భవిష్యత్తును నిర్ణయిస్తాడు. ప్రతిసంవత్సరం 2000 రచయితల రచనలు ప్రచురణకు నోచుకుంటాయి. భవిష్యత్తులో మరో పుస్తకం రాయడానికి ప్రచురణ సంస్థ, రచయిత ఒక contract చేసుకుంటారు. రచయిత తన వ్రాతప్రతిని ప్రచురణ సంస్థకు యివ్వకముందే ఆరచనలోని సృజనాత్మక గొప్పతనాన్ని బట్టి ఆ రచయిత తన నివేదనను సమర్పించినమీదట contract చేసికొనడం జరుగుతుంది. అంగీకారపత్రం మీద సంతకం చేసిన తరువాత రచయిత ఒప్పందంలో కుదుర్చుకున్న సొమ్ములో 25 పర్సంట్ అడ్వాన్సుగా పొందుతాడు, పుస్తకం పూర్తిఅయి సమీక్షకులు దానిని ప్రచురణకు సిఫార్సు చేసినతరువాత, 35 పెర్సంట్ పొందుతాడు. పుస్తకంయొక్క అడ్వాన్సు కాపీ తయారయిన తరువాత మిగిలిన 40 పెర్సంట్ పొందుతాడు.

ఆ ప్రతులు పూర్తిగా అమ్ముడు పోయినవా, లేదా అనేదాని మీద ఇతనికిచ్చే సొమ్ము ఆధారపడిలేదు. ఆ పుస్తకం రాసేటప్పుడు ఆ రచయిత దేశంలో ఎక్కడైనా దానికి సంబంధించి విషయసేకరణకై తిరగవలసి వస్తే ఆ ఖర్చుగూడ ఆ ప్రచురణసంస్థ భరిస్తుంది. యువరచయితలకు " Roadmiki " అనే పత్రిక ప్రతి సంవత్సరం వస్తూ యువకుల రచనలకే ఎక్కువ ప్రాధాన్యత నిస్తుంది.

మాగ్జింగోర్కీ పేరు మీద 1933 డిశంబరులో సాహితీసంస్థ ఒకటి ఏర్పాటుచేశారు అప్పటినుండి ఈ 46 సంవత్సరాలలో సుమారు 2000 పైగా కవులు, గద్య రచయితలు, నాటకరచయితలు, విమర్శకులు, అనువాదకులూ ఈ సంస్థ నుండి డిగ్రీలుపొందారు. సెకండరీ విద్య అయిపోయి శక్తిసామర్థ్యము లున్న 35 సంవత్సరములకు మించని ప్రతివ్యక్తి దీనిలో సభ్యుడుగా చేరవచ్చు. దీనిలో డిగ్రీతీసికొనుటకు 5 సంవత్సరముల కోర్సుంటుంది. దీనిలో పట్టభద్రుడైన

ప్రతివాడు రచయిత కాకపోవచ్చు. దీనిలో చదివిన వారికి పత్రికారంగంలో సంపాదకులుగా, జర్నలిస్టులుగ పోవుటకు అవకాశం లభిస్తుంది. సోవియెట్ దేశంలోని ప్రఖ్యాత రచయిత లందరూ ఈ సంస్థతో సంబంధమున్న వ్యక్తులే. ఫెడిన్, లియొనావ్ పాస్టోవస్కీ, సిమనోవ్, గస్జతోవ్, ఐత్మతోవ్, అమ్మిదులీనా మొదలైనఆనాటి విద్యార్థులంతా ఈ నాటి గొప్ప రచయితలు.

ఈ విధంగా సోవియట్ దేశంలో రచయితలూ- సంస్థలూ తమ సాహిత్యం ద్వారా మహోన్నతమైన కొత్త మానవుణ్ణి సైద్ధాంతికంగా - కళాత్మకంగా తయారు చేయడానికి కృషి చేస్తున్నారు.

❀❀

# మండేగుండెకు దారి ఏది?

ఎ. యస్. నాగేశ్వరరావు

మూడు జాములా పొద్దులోనా
సిమ్మసీకటీ రేత్రిలోనా
కపిలబానా తోలుతున్నా
కాడెద్దులు లాగకున్నా
ఇనరా కనరా ఎంకటసామీ
నిజం చెబుతూ నీరై పోతున్నా
విన్నపేలా చేవిలోనా
శెనిగిసెట్లా వామిఏస్తే
అప్పుకిందా సెప్పకుండా
లచ్చిమరెడ్డి లాక్కుపోయెరా
॥ఇనరా కనరా॥
అద్దరేతిరీ పండుకోని
పొద్దుపొడిసి నిద్దురలేసీ
మూడుపొద్దులా శాకిరిసేస్తూ
ముద్దకాడనే ఎలియేత్తిరా-
॥ఇనరా కనరా॥
గుండెలమీదా బరువులుమోసీ
బంజరుచేనూ అరువుకట్టి
కుంటలోనా నీళ్ళుపెడితే
పంటనాదని పాపిరెడ్డే-
॥ఇనరా కనరా॥

బాయికాడా కలుపుదీసీ
సంకటేలకు ఇంటికెడితే
సావుకోరీ బలిసినగొడ్లూ
పయిరు సాపూదేసినాయీ
॥ఇనరా కనరా॥
మడకదున్నా కాడికడితే
బొడుగుఎద్దూ బోళ్ళబడితే
పరసకుతోలీ కసాయకమ్మీ
గుడ్లనీళ్ళతో గుండెలగునపారే
॥ఇనరా కనరా॥
పస్తులతోటీ కాపురాలూ
ఎన్నాళ్ళుసాగూ? ఏరీతి బాగూ?
బిడ్డల బతుకు బుగ్గిపాలూ
గుండె చెరువై పాయెరా
॥ఇనరా కనరా॥
భూమిలేదూ పుట్టాలేదూ
నోటికింతా ముద్దలేదూ
సేతికి సుంతాసత్తాలేదూ
మండేగుండెకి దారిఏదీ?
॥ఇనరా కనరా॥

# పాటలతో పాట్లు

కథానిక

—ఆదూరి వెంకటసీతారామమూర్తి

బస్సుకోసం ఎదురుచూస్తూ అరగంట అయింది.-కాళ్ళు లాగేస్తున్నాయి- ఇలా ఎదురుచూడడంలోనే సగం జీవితం గడచిపోతూంది-

నడచిపోయినా యీపాటికి యిల్లు జేరి పోదును.పోనీ ఆటోని కేకేద్దామన్నా మూడు రూపాయలకు తక్కువకి రాడు- రిక్షాకైనా అందులో సగమివ్వాలి - చీకటి పడుతోంది!

అప్పుడే బజారు అందం చూడాలి; సూదుల దగ్గర్నించీ టెర్లిన్ చీరల వరకూ; పకోడీల దగ్గర్నించీ పనస పళ్ళ వరకూ అన్నీ ఫుట్‌పాత్ మీదే దొరుకుతాయి-

"ఇదిగో అబ్బాయ్. నీ దగ్గర అన్ని రకాల పాటల పుస్తకాలు వుంటాయా" తెలిసిన గొంతులా వుంటే తల త్రిప్పి చూశాను-ఎవరో ముసలాయన-ప్రక్కనున్న సినీమాపాటలపుస్తకాలమ్మేవాడిని అడుగుతున్నాడు-

"ఉన్నాయిబాబూ. ఏమిటి కావాలో చెప్పండి" అన్నాడువాడు-

నిజానికి ఆ వ్యాపారమే బాగుంది. అసలు-ఉద్యోగంకన్నా ఏవ్యాపారమైనా బాగానే ఉంటుంది - నేను నిల్చున్న అరగంటలోనూ సుమారొక పదిపాటల పుస్తకాలు అమ్మిఉంటాడు వాడు — ఈరోజుల్లో సిన్మాల మోజు అంతాఇంతా కాదు.

"చూడూ-బాగా అమ్ముడవుతున్న సిన్మా పాటల పుస్తకాలు కావాలి" అడుగుతున్నాడాయన - వయసు యాభై పైనే వుంటుంది.

"సీతాకళ్యాణం, శ్రీరామ పట్టాభిషేకం; కర్ణ...మీ ఇష్టం- ఏం కావలిస్తే అవే వున్నాయి చూడండి."

"సర్లే- నాక్కావల్సినవి అవికావు- కుర్రాళ్ళు బాగా కొనుక్కుంటున్న పుస్తకాల్లేవూ...? అవీ...."

"అయీ వున్నాయి బాబూ-ముత్యాల ముగ్గు, మనూరిపాండవులూ, తూర్పువెళ్ళే రైలూ....కళ్యాణి..."

"అవున్లే-అవి మంచివే-కాదన్ను. కానీ నాక్కావల్సినవి అవికావు-కుర్రాళ్లు తప్పట్లు చరిచి ఈలలేస్తూ పాడుకునే పాటలుండవ్- ఆ పాటల పుస్తకాలు కావాలి" అన్నాడాయన వాడి మాటల కడ్డుతగుల్తూ-

ఆ తర్వాత

చుట్టూచూసి, నేను గమనిస్తున్నానని పసిగట్టి గొంతు తగ్గించి, అయోమయంగా చూస్తావేంటయ్యా ' ఇందా

యిందా తీసుకో ' "ఎత్తుకుంటావా నన్నెత్తమంటావా" "నువ్వు రమ్మంటే ఎన్నాడైనా రానన్నానా నువ్వడిగిందే నేనెడైనా లేదన్నానా". అలాంటి పాటలు వినలేదయ్యా - అవీకావాలి "అన్నాడు- ఆ మాటలకు షాపువాడు ఫక్కుననవ్వి." అర్థలా చెప్పండి. డబుల్ మీనింగుగల సాంగులన్న మాట. మరవిజెప్పడానికి సిగ్గుపడతారేం "అన్నాడు.

"డబుల్ మీనింగులని నువ్వను కుంటున్నావు. కానీ నాకు వాటిల్లో ఒకే మీనింగు కన్పిస్తుంది" దానికి షాపు వాడు నవ్వి, అవేటి బాబూ సొచ్చంగా బూతుకన్పిస్తుంటే' అన్నాడు విడమర్చి -

అవేనయ్యా - నాక్కన్పించిందీ ఆ మీనింగే - మరోమీనింగులేదు. అన్నా డాయన చుట్టూచూస్తూ.

నా ఆశ్చర్యానికి అవధుల్లేవు. ఎవరో కుర్రకారు కొనుక్కున్నారంటే ఏదో సబబుగానే వుంటుంది - యాభైయ్యే ళ్ళాయన బూతుపాటలకోసం ఆరాటపడు తున్నాడంటే ఆశ్చర్యమేసింది - అవును మరి! స్టాండర్డ్స్ యిలా దిగజారు తున్నాయి కాబట్టే అటువంటి సాహిత్యం ఉత్పత్తి అవుతుంది - అటువంటిపాటలే ప్రజలు కోరుకుంటున్నారు కాబట్టే వాటినే సిన్మాలో చొప్పిస్తున్నాం అని తప్పుకుంటున్నారు నిర్మాతలూ, సంగీత దర్శకులూ-అటువంటి పాటలే రాయ మంటున్నారు. కాబట్టి భుక్తికోసం రాయక తప్పటంలేదు అంటున్నారు కవీశ్వరులు-కానీ అందరు ప్రేక్షకులూ, అందరు శ్రోతలూ, అందరు నిర్మాతలూ కవులూ అట్లానే వున్నారా అంటే-అదీ లేదు! ఏది యేమైనా సకుటుంబంగా చూడతగ్గ సినీమాగాని, కుటుంబ సభ్యు లంతా ఒకచోట కూర్చొని వినతగ్గ సినిమా పాటగాని కరువైపోతుందంటే ఆశ్చర్యంలేదు వీటన్నిటికీ తోడు కాలేజీ కుర్రాళ్ళు క్లాసులెగ్గొట్టి చూట్టానికి, మూపలీ ముతకా దాటుగా చూడ్డానికి అనువుగా నూన్‌షోలూ- సెక్స్‌చిత్రాలూ-

నా ఆలోచనలు పూర్తయ్యే సర్కి ఓ దొంతు పుస్తకాలను సెలక్ట్ చేసి, యింకా గుర్తుకురాని పాటలను నెమ్మదిగా గుర్తు తెచ్చుకుంటూ అడు తున్నాడాయన.

ఒక్కసారిగా నాకందరి మీదా కోప మొచ్చింది.

ఏం ప్రయోజనం? ఈలోగ బస్సు కూడారానే వచ్చింది.

రెండ్రోజుల తర్వాత - ఓ సాయం కాలం గురజాడ మందిరంలో సభ జరుగుతూంటే ఏమిటోచక లోపలికి చూశాను- స్టేజిమీద అతను! మెళ్ళో పూలదండలు....ఆరోజు బూతు సిన్మా పాటలు పుస్తకాలు కొన్నఆసామీ-

అంతవరకూ మైకుముందు ప్రసం గిస్తున్న ఒకాయన ఒక్కసారిగా గొంతు మార్చి. దిగజారుతున్న నేటి సాహిత్య విలువలను గురించి శ్రీమురళీకృష్ణ గారు సోదాహరణంగా వివరిస్తూ చేసిన ప్రసంగం మన యువతకు చాల ఉప యోగిస్తుందని భావిస్తూ అందరితరఫునా ఆయనకు మాధన్యవాదాలు తెల్పు కుంటున్నాం' అని చెప్పి దిగిపోయాడు.

నేను శిలాప్రతిమనే అయ్యాను!

# తెలుగు నిఘంటువులు - ప్రపంచవ్యాప్త కృషి

—ప్రొ॥ కొత్తపల్లి వీరభద్రరావు

ఐతిహాసిక కారణాలవల్ల, పాశ్చాత్యులు నిఘంటువులలో - ఇంచు మించుగా అన్నీ - ఇంగ్లీషుతో సంబంధం ఉన్నవే. ఇంగ్లీషు - తెలుగు, తెలుగు - ఇంగ్లీషు నిఘంటువులే. ఇంచుమించుగా అన్నాంగనక, ఫ్రెంచి - తెలుగు, పోర్చుగీసు - తెలుగు, డచ్చి - తెలుగు నిఘంటువులు కొన్ని బయలుదేరినట్లు ఆధారాలు ఉన్నాయి ఇటీవలికాలంలో తెలుగు - రష్యన్ నిఘంటువూ ఒకటి వచ్చింది.

మొదట్లో నిఘంటు నిర్మాణ కార్యక్రమంలో కృషిచేసిన పాశ్చాత్యులందరూ తాము తెలుగు నేర్చుకొంటూ ఉన్నప్పుడు వచ్చినమాటల్ని వ్రాసుకొంటూపోతూ వచ్చి నిఘంటువుల్లాంటి పదపట్టికల్ని తయారుచేసినవాళ్ళే. తరువాత పండితుల సాయంతో నిఘంటువుల్ని తీర్చిదిద్దుకొన్నారు. తమ నిఘంటువులు ఇంగ్లీషువచ్చిన వాళ్ళు ఇంగ్లీషునేర్చుకోవడానికీ. పనికివస్తాయని విశ్వసించారు. పాశ్చాత్యులు కూర్చిన నిఘంటువుల్లో సి. పి. బ్రౌన్ నిఘంటువులకు వచ్చినంత వ్యాప్తి మరి ఇంకెవరు కూర్చినవాటికీ రాలేదనేది అందరికీ తెలిసిన సత్యం. అవి బయలుదేరిన నూరేళ్ళ తరువాత కూడా మన విద్వాంసులు అకాడెమీలు వాటిని పునర్ముద్రణ చేయడం, ప్రజలు వాటిని ఆదరించడం చూస్తే వాటి వైశిష్ట్యం తెలుస్తుంది. తెలుగు భాషా సాహిత్యాలకు నాటినుండి నేటివరకు బ్రౌనుదొర చేసినసేవకు మించి సేవ చేసినవారు పాశ్చాత్యులలో ఎవరూ లేరన్నప్పుడు. ఆయన నిఘంటువులు ఈ స్థానాన్ని పొందడంలో ఆశ్చర్యంలేదు.

19వ శతాబ్ది మధ్యకాలంలో వచ్చిన బ్రౌను నిఘంటువుల కంటే ముందే 1821లో వచ్చిన ఏ.డి. కాంబెల్ నిఘంటువు, జె. సి. మారిస్ 1885 - 1889 మధ్యకాలంలో కూర్చగా కాలేజి బోర్డువారు అచ్చువేసిన నిఘంటువు, విలియం బ్రౌన్ నిఘంటువు ప్రచారంలో ఉన్నాయి. కాని బ్రౌనుదొర నిఘంటువులు కూర్చాడంటే తానొక్కడే ఏమూలో కూర్చుని పనిచెయ్యలేదు. ఈనాటి పరిభాషలో, ఆయన నిఘంటు నిర్మాణాన్ని ఒక ప్రాజెక్టుగా గ్రహించి, పదులకొలది పండితుల్ని సంప్రదించి, వందలకొలది పుస్తకాల్ని అవలోకనంచేసి, తన యింటినే కాలేజీగా మార్చి, సొంతడబ్బు మంచినీళ్ళప్రాయంగా వెచ్చించి, నిఘంటువుల్ని కూర్చాడు. అంతకంటే ఎక్కువగా శ్రమపడి ముద్రణం యింకా ప్రారంభదశలో

ఉన్న ఆ కాలంలో - వాటిని చక్కగా ముద్రించాడు ముద్రణం విషయం లో కొన్ని సంస్థలనుంచి ఆర్థిక సహాయాన్ని పొందినా, నిఘంటునిర్మాణకృషిలో పడిన శ్రమకు ఖరీదుకట్టే షరాబులు లేరుగదా, తెలుగును, తెలుగువాళ్ళను ప్రేమించి ఈ కృషి చేశానని ఆయనే చెప్పుకొన్నాడు. తన నిఘంటువులు, తెలుగువాళ్ళు యింగ్లీషు నేర్చుకోవడానికి పనికివస్తాయని వ్రాశాడు కూడా.

ఇంగ్లీషు - తెలుగు, తెలుగు - ఇంగ్లీషు నిఘంటువులు 1852లో అచ్చయి నట్లు మనం గ్రహించవచ్చు. ఈ రెండు సమాంతరంగా వికాసాన్ని పొందాయి. ఈ నిఘంటు నిర్మాణంలో ఆయన ప్రదర్శించిన పాండిత్యాన్ని మనం నేడు మెచ్చుకొంటూ ఉన్నట్లే, ఆనాటి పండితులూ మెచ్చుకొన్నారని బ్రౌనుదొర వ్రాశాడు. తనకు - బైబిలు, షేక్స్పియర్, మిల్టను - పూర్తిగా నోటికి వచ్చినట్లున్నదని తమ పండితులు అనేవారని ఆయన వ్రాశాడు, తన నిఘంటువులలోని ఇంగ్లీషు భాగమంతా తాను ఇతరుల సాయం లేకుండా సిద్ధంచేసినదేననీ, తెలుగు భాగానికి అనేక పండితుల సాయం తనకు లభించిందనీ వ్రాశాడు. తనకు చాలా సాయం చేసిన నిఘంటువులలో - కాంబెల్ దొర నిఘంటువును, మామిడి వెంకయ్య ఆంధ్ర దీపికను విల్సన్ దొర నిఘంటువులలో సంస్కృత నిఘంటువును ఈయన పేర్కొన్నాడు. ఇవిగాక - కన్నడ, తమిళ, వంగ, హిందుస్థాన్ నిఘంటువులు, ఎన్నో శాస్త్ర నిఘంటువులు ఈయనకు సాయపడ్డాయి. ఆంధ్రభాషార్ణవాది నిఘంటువులు ఐదు, శబ్దకల్పద్రుమాది సంస్కృత నిఘంటువులు ఉపయోగపడ్డాయి. ఈయన తెలుగు - ఇంగ్లీషు నిఘంటువులలో నూటికంటె ఎక్కువమంది తెలుగు గ్రంథ కర్తల రచనలనుండి ఉదాహరణలు యివ్వడం జరిగిందని వ్రాశాడు. మాటల్ని నిర్వచించేటప్పుడు సంశయం కలిగితే, నాటి చెన్నపట్టణ పాఠశాలలో ఆంధ్ర భాషకు మొదటి ఉపాధ్యాయుడైన రావిపాటి గురుమూర్తిశాస్త్రి, వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రి మొదలయిన పండితుల అభిప్రాయాలు సేకరించి తనకు నచ్చితే యుక్తి యుక్తాలయితే గ్రహించేవాడు. వ్యావహారిక భాషకు తన నిఘంటువులో స్థానం కల్పించాడు. సమకాలికుల వ్యావహారిక భాషలో ఉన్న రచనలనుంచి ఉదాహరణలు గ్రహించాడు. చెన్నపట్టణంకోర్టులో దుబాసిగా ఉన్న ఏనుగుల వీరాస్వామయ్య 'కాశీయాత్ర' చరిత్రను, తన నిఘంటువులోని కొన్నిపదాల నిర్వచనాలకు ప్రమాణంగా గ్రహించాడు.

తెలుగు-ఇంగ్లీషు నిఘంటువులో ఒక వర్గంలోని వివిధాక్షరాలతో - అను నాసికాక్షరం విడిచి - ప్రారంభమయ్యే మాటల్ని అన్నింటిని అకారాది అచ్చుల క్రమంలో ఒకేచోట యివ్వడమనే కొత్తపద్ధతిని ప్రవేశపెట్టాడు. దీనివల్ల - కోత, గోత్రము, ఘోణి మొదలయిన మాటలు ఒకదాని తరువాత ఒకటి వచ్చాయి. యిదే పద్ధతిని - శ,ష,స-ల విషయంలోనూ అవలంబించడం వల్ల - శాతము షాడబము సాతాని మొదలయిన మాటలు ఒకదాని తరువాత ఒకటి వచ్చాయి. తెలుగు మాటలలో

పరుషాలతో ప్రారంభమయ్యేవి సరళాలతో కూడా వాడుకలోను, వ్యాకరణ కార్యాల్ని బట్టి - కనబడడం ఈ పద్ధతిని బ్రౌనుదొర అవలంబించడానికి కారణము యింది గోరు కోరు, దోవ-తోవ మొదలయినవి అయన ఉదాహరణలుగా ఇచ్చాడు ఈ సందర్భంలో. ఆంధ్రదీపికలోయిచ్చిన 'దువాలించు' అనే క్రియను ఉదహరిస్తూ కొందరు దీన్ని 'తువాలించు, అనీ, మరికొందరు 'ధువాలించు' అనీ అంటున్నారు. నేను కలిపినట్లు మాటల్ని కలపకపోతే ఈ క్రియ మూడుచోట్ల యివ్వవలసి వస్తుంది గదా? అన్నారు బ్రౌనుదొర. ఈ పద్ధతి నాటి పండితులలోనే కొందరికి నచ్చలేదని అయన వ్రాశాడు. తరవాత ఈ పద్ధతి సహజంగానే నిరాదరణ పొందింది.

ఈ నిఘంటువుల తరువాత, అయన 'మిశ్రభాషా నిఘంటువును, పేర్కొనాలి దీనిలో నాటి వ్యవహారంలో ఉన్న అన్యదేశీయాలు ఉన్నాయి. 1854లో అచ్చయిన దీనిలో తెలుగులిపిలోమాట, దానికి ఫార్సీలిపిలో వ్రాత ఇంగ్లీషులిపిలో ఫార్సీ ఉచ్చారణ, ఇంగ్లీషులో అర్థం -తెలుగులో అర్థవివరణ ఉన్నాయి. అంటే యిది మూడు లిపులలో అచ్చయింది. ఆనాటి కోర్టు భాషకు ఉదాహరణంగా అయన యిచ్చిన ఈ వాక్యం వినండి. 'ఈ నంబరులో డిఫెండంటు సమ్మను' చూచి సైను చేసి వాయిదా చెప్పిన కోర్టులో హాజరు అయి అన్సరు యియ్యక పోయినందున యిందులో యెక్సుపార్టి దర్యాప్తు చేయవలసిన ప్లేంటిఫ్ ప్లీడరు మోషను చేసినాడు గనుక ఆమోషను రికార్డులో దాఖలు చేసి అందులో దర్ఖాస్తు చేసిన చొప్పున నడిపించేలాగున ప్రొసీడింగ్సులో ఆర్డరు ఎంటరుచేయుడమయింది'.

ఈ నిఘంటువుగాక జిల్లాలలో జరిగే కార్యక్రమాలకు సంబంధించిన పదజాలం ఉన్న 'జిల్లా నిఘంటువును, ఒకదాన్ని 1852లో బ్రౌనుదొర ప్రకటించాడు. తరువాత యిది విల్సన్‌దొర ప్రకటించిన 'కోర్టు-రెవెన్యూ పదాల పట్టికలో, 1855లో లీనమై పోయింది. ఇంత కృషిచేసినా, తాను వాడుకలో లేని పదాల్ని నిఘంటువులో సృష్టించి చేర్చలేదని, ఆ సృష్టిచే శక్తి తెలుగు మాతృభాషగా ఉన్న ప్రజలిది కాని విదేశీయుడైన తనది కాదని బ్రౌనుదొర వినయంగా వ్రాశాడు. బ్రౌణ్య నిఘంటువులు ఇంతటి ప్రామాణికాలు కనుకనే, శబ్దములు కొన్ని చేర్చబడినవి అని తన నిఘంటువులో పేర్కొనడం జరిగింది. గిడుగు వెంకట రామమూర్తి శబ్దరత్నాకరమునకు బ్రౌణ్య నిఘంటులే ఆధారము అనీ శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాతలు బ్రౌణ్య నిఘంటువు ప్రమాణముగ స్వీకరించినారు. అందుకు నేను చాలా సంతోషిస్తున్నాను అనీ వ్రాయడం జరిగింది.

బాల్డియల్ అనే ఒకదొర నిఘంటువు నొకదాన్ని కూర్చి, మాదిరి కాగితాలు కళాశాలాధికార్లకు చూపించగా ఆ అధికార్లు దాన్ని అచ్చువేయడానికి ఒప్పుకోనట్లు తెలుస్తోంది. 1700 ప్రాంతంలో ఫ్రెంచి మిషనరీలు ఒక తెలుగు - ఫ్రెంచి నిఘంటువు తయారుచేసినట్లూ దాన్ని తాను 1855లో చూచినట్లూ సి. పి. బ్రౌను వ్రాశాడు.

ఇంక 20వ శతాబ్దిలో పాశ్చాత్యుల కృషి ఫలితంగా బయలుదేరిన నిఘంటువులు చుద్దాం. 1938లో ఎ. గలెట్టి అనే సివిల్ సర్వీసు ఉద్యోగి ఒక వ్యావహారికాంధ్ర నిఘంటువు కూర్చాడు. ఇది 1938లో ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్‌లో అచ్చయిం ది. ఆ రోజుల్లో మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉన్న బొబ్బిలి రాజా గారికి యిది అంకితమైంది. కొత్తగా ఉద్యోగంలో చేరిన అసిస్టెంటు కలెక్టర్లు, మిషనరీలు మొదలయినవాళ్ళకి యిది ఉపయోగపడగలదని గలెట్టి వ్రాశాడు. దీని విశేషం ఏమిటంటే - దీనిలో రోమన్‌లిపి వాడ్డం జరగడం, దీన్నిచూచి తెలుగువారు ఇది ఏ డిక్షనరీ? డిక్షనరీ, గిక్షనరీ' అని అనవచ్చునని రోమనులిపిలోనే రచయిత వ్రాశాడు. దీనికి ఉపోద్ఘాతం వ్రాసిన ఆర్. గలెట్టి కాలక్రమంగా తెలుగు అధికార భాష అయిననాడు తెలుగులోనే వ్యవహారమంతా జరుగుతుందనీ అప్పుడు కూడా ఇంగ్లీషు శబ్దజాలం తెలుగును సంపన్నం చెయ్యడానికి పనికి వస్తుందనీ వ్రాశాడు.

ఇంక ఇప్పుడు మనం మాస్కోలో 1972లో అచ్చయిన 'తెలుగు - రూస్కియ్ సవార్' తెలుగు - రష్యన్ నిఘంటువును పరిశీలించాలి. రష్యన్ భాషలో సవార్ అంటే నిఘంటువు. దీనిలో 42,000 పదాలున్నాయి. దీని కర్తలు - యస్. డ్జెనిద్, పి. పెచ్. జి. పెత్రునిచెవా, గూరోవ్‌లు. దీని సంపాదకుడు - డా॥ ఉప్పల లక్ష్మణరావు. దీన్ని 'ఇజదిలెస్త్వొ సవ్యెత్స్కయా ఎన్‌త్సిక్లోపెదియా' సోవియట్ విజ్ఞాన సర్వస్వ ప్రచురణాలయం ప్రచురించింది. ఈ నిఘంటువుకు అనుబంధంగా యస్. డ్జెనిత్, ఎస్. గూరోవ్‌లు రష్యను భాషలో వ్రాసిని తెలుగు వ్యాకరణంకూడా ఉంది.

'ప్రిదిస్లవియే' అనే 'తొలిపలుకు' లో దీని రచనోద్దేశాన్ని యిలా తెలిపారు- 'తెలుగు - రష్యన్ నిఘంటువు మీద కృషి ఒక ప్రత్యేక ఉద్దేశంతో ప్రారంభించాం అదేమిటంటే తెలుగు భాషా వ్యాకరణాలకు చెందిన ముఖ్యవిషయాలు తెలిసిన వాళ్ళకు ఈనాటి కథలూ పత్రికలూ పద్యాలు చదువుకోవడంలో తోడ్పడడం.

గ్రాంధిక వ్యావహారిక భాషావాదాల్ని గురించి యిలా వ్రాశారు - 11-19 శతాబ్దాలలోకూడా తెలుగులో గ్రాంథిక వ్యావహారిక భాషలకు పెద్దవ్యత్యాస వుంది. దానికి గాఢ చారిత్రక కారణాలు ఉన్నాయి. గ్రాంధికభాషపైన సంస్కృతభాషకు గొప్పప్రాబల్యం ఉంది. 20 శతాబ్దంలో వ్యావహారిక భాషా మహోద్యమకృషి గురజాడ అప్పారావూ, గిడుగు రామమూర్తి కొనసాగించారు.

ఈ నిఘంటు నిర్మాణంలో తెలుగుదేశంలోని పండితుల సాయమూ శబ్ద రత్నాకరాది నిఘంటువుల సాహాయ్యమూ తీసుకొన్నట్లు వ్రాశారు. బ్రౌణ్య నిఘంటువుల సాయం వుందని వేరే చెప్పనక్కరలేదుగదా! సర్వాంగసుందరంగా అచ్చయిన ఈ నిఘంటువులలో వ్యావహారిక భాషకు ప్రాముఖ్యం యిచ్చినా గ్రాంధికభాష యథోచితంగా చోటు చేసుకుంది.

ఈ విధంగా తెలుగు నిఘంటు నిర్మాణంలో ప్రపంచవ్యాప్తంగా కృషి జరుగుతోంది. ఈ పరిస్థితుల్లో మనం వెనకపడిపోకుండా ఇతరులకు మార్గదర్శకులం కావాలి.

— (ఆకాశవాణి హైదరాబాదు సౌజన్యంతో)

---

# 'అమరజీవి'

ఈ పుండు మానదు
ఈ పండు రాలదు
ఈ పుండుకు మందులేదు
ఈ పండుకు చావు రాదు
ఈ పుండు రాచపుండు
ఈ పండు శత మొండు
ఈ పుండుకు చైతన్యమే మందు
ఈ పుండుకు విప్లవమే మందు
ఈ పుండు ఎప్పటికీ నుండు
ఈ పండు ఎన్నటికీ ఉండు

ఈ మనుషులకు రోషం రాదు
ఈ మనుషులకు రేషంచేమ
అందుకే —
ఈ పుండు పండదు
ఈ పుండు ఎండదు
ఈ పుండుకు రంగుపోదు
ఈ పండుకు భయంలేదు
ఈ పుండు ఎర్రగుండు
ఈ పండు ఎర్రదండు

—కె విశ్వనాథ్, పి సారంగపాణి

# వేట

అనేందుకు కూడదా
ఉందేందుకు గూడూ
లేకున్నా -
ఊరవతలి
పాడు బడ్డ బీడు
లోని వల్లకాడు
లోని ఎండిన మోడు, లాంటి
ఎముకల గూడు
మాత్రం మిగిలివుంది.
అందుకే, అందరికీ తెలుసు
నే నెందుకూ పనికిరానివాణ్ణని
ఏమీలేని నాచుట్టూ
ఏ బంధమూ మూగదని.
కానీ, మళ్ళీ రాబందులు వస్తున్నాయి —
నాకున్న ఒక్క ఓటు పీక్కుతినడానికి

— కిషన్‌రావు తంగెడ

కథానిక

# "కఠిన సత్యం"

## —డాక్టర్ అల్లూరి రాజకుమారి

రావుకి సడన్‌గా కడుపులో నెప్పి వచ్చింది. బాధతో మెలికలు తిరిగి పోతున్నాడు. భార్య లీలకు ఏమీ తోచ లేదు. గాబరాగా ఫామిలీ ఫ్రండ్. సర్జరీ ప్రొఫెసరూ అయిన చౌదరిగారికి ఫోనుచేసింది. ఆ రాత్రి పన్నెండు గంటల సమయంలో కూడ కబురందగానే వచ్చేశాడు డాక్టర్ చౌదరి.

"ఎప్పటి నుండి నెప్పి? వామిటింగ్స్ అవుతున్నాయా? టెంపరేచర్ వున్న ట్టుందే! డిన్నర్ ఏం తీసుకున్నారు? నెప్పి ఎటువైపు ఎక్కువగా వుంది? కుడి వైపునా?" పొట్టనొక్కుతూ అడిగాడు. కుడివైపు నొక్కగానే కెవ్వుమని అరిచి గిలగిల్లాడిపోతున్నాడు రావు. లీలకు కళ్ళ నీళ్ళు తిరిగాయి.

"ఇది ఎక్యూట్ అపెండిసైటిస్ వెంటనే ఆపరేషన్ జరగాలి. పరీక్ష పూర్తి చేస్తూ అన్నాడు డాక్టరు.

గుండె బేజారయ్యింది లీలకు, అపెండిసైటిస్ అంటే ఇరవై నాలుగ్గంట లలో ఆపరేషన్ జరగాలంటారు కదూ! ఇప్పుడేం చెయ్యాలి పెద్ద వాళ్ళెవరు దగ్గరలేరు. తల్లి దండ్రులూ, అత్త మామలూ, ఎవరి స్వగ్రామంలో వారు న్నారు. అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూ బావగార్లూ ఉద్యోగరీత్యా తలొక ఊర్లోనూ ఉన్నారు. ఇక్కడ తనకెవరున్నారు? కన్నీళ్ళు పెట్టుకుంది.

'అదేమిటమ్మా! అపెండిసైటిస్ కేస్‌కే అంత భయమా? మరేం ఫరవాలేదు. కానీ వెంటనే ఆపరేషన్ జరగాలి. తొందరగా రెడీఅవ్వండి రావుని తీసుకు వెళదాం' నచ్చచెబుతున్నట్టుగా అన్నాడు డాక్టరు.

"డాక్టర్‌గారూ! నాకుచాలా భయంగా వుంది పోనీ మావాళ్ళు వచ్చే వరకూ ఆగకూడదూ! అమ్మో! ఆపరేషనంటే నేనొక్కదాన్నే ఏంచెయ్యను.? నాకసలే భయం " గుండెలమీద చెయ్యి వేసు కుంటూ అందిలీల

"బాగుందమ్మా! ఇప్పుడు ఎమర్జన్సీ అంటే మావాళ్ళువచ్చేవరకూ ఆగమంటా రేమిటి. ఏ మాత్రం ఆలస్యం చేసినా ప్రమాదం. అయినా మేమంతాలేమా? మీ వాళ్ళకి కబురుచేద్దాం ముందు మీరు కదలాలి" విసుగుదాచుకుంటూ హెచ్చ రిస్తున్నట్టుగా అన్నాడు డాక్టరు.

గబాగబా ప్యూన్ని పిలిచి తనవాళ్ళ అడ్రెస్‌లు, ఫోన్‌నెంబర్లుయిచ్చి రావుతో కలసి డాక్టరు కారులో కూర్చుంది లీల.

రావుని స్ట్రెచర్‌మీద వార్డులోకి తీసుక వెళ్ళారు. స్పెషల్‌రూము ఒక్కటి కూడా ఖాళీలేదు. ఇకచేసేదేంలేక జన

రల్ వార్డులోనే ఒక మూలగావున్న బెడ్ ఎలాట్ చేశారు. అయినా ఉన్న వాళ్ళకి జనరల్‌వార్డులోనే స్పెషల్‌రూం తయారయిపోతుంది. చీఫ్ స్వయంగా వచ్చి అడ్మిట్ చేయడంలో వార్డ్‌బోయ్ డ్యూటీ నర్స్ చకచకా పనులు చేస్తున్నారు. రావు మంచం చుట్టూ స్క్రీన్ స్టాండ్ పెట్టారు. సెలైన్ స్టార్ట్‌చేసి ఆపరేషన్‌కి రెడీచేశారు. థియేటర్ నర్స్‌కి, అనస్థటిస్ట్‌కి మెమోస్ వెళ్ళాయి.

తెల్లవారుతుండగా ఆపరేషన్ పూర్తయి రావుని మళ్ళీ బెడ్ మీదకు మార్చారు. ఒక చేతికి సెలైన్ ట్యూబ్ ముక్కులో రైల్స్ ట్యూబుతో అచేతనంగావున్న రావుని చూసి లీల భోరుమని ఏడుపు ప్రారంభించింది. డ్యూటీనర్స్ గబగబా లీలను రూమ్‌లోపలికి తీసుకు వెళ్ళింది. డ్యూటీ అసిస్టెంటు డ్యూటీ హౌస్‌సర్జను బి.పి పల్సుచూసుకుంటూ అక్కడే వున్నారు.

కబురందగానే డైరెక్టుగా టాక్సీవేసుకుని తెల్లవారేటప్పటికి వచ్చేశారు. అటు తల్లిదండ్రీ ఇటు అత్తమామలూ, రావడమే హాస్పిటల్‌కి వచ్చేశారు. అప్పటికే రావుకి ఆపరేషన్ అయి పరిస్థితిసంతృప్తికరంగా వుండడంలో బలవంతంమీద లీలను తీసుకుని యింటికివెళ్ళారు లీల తల్లీ, తండ్రీ, రావుతల్లి దండ్రులిద్దరూ రావుని చూసుకుంటూ అక్కడే వుండిపోయారు.

ఇల్లుచేరగానే లీల స్నానంచేసి గబగబా రెడీయై తండ్రి కాసేపు విశ్రాంతి తీసుకొమ్మన్నా తను వినిపించుకోకుండా మళ్ళీ హాస్పిటల్ చేరింది.

నాలుగైదు రోజులు గడిచాయి. రావు సంతృప్తికరంగా కోలుకుంటున్నాడు. ఆ రోజే తేలిగ్గా ఆహారం యిచ్చారు. లీల ఒక్క క్షణం అతని మంచంవదలి పెట్టడంలేదు. అందరూ వచ్చి లీలకు ధైర్యంచెప్పి వెళ్ళిపోతున్నారు. ప్రతి పూటా ఎవరోఒకరు బలవంతంగా పెడితే కానీ భోజనమైనా చేయటంలేదు. అత్తగారు కోడలికి తన కొడుకుపైగల ప్రేమకుమురిసిపోతుంది. సరిగ్గా ఆహారం తీసుకోమని కోడలిని మందలిస్తోంది. జనరల్ వార్డులో వుండవలసి వచ్చినందుకు విసుక్కుంటూ, తిట్టుకుంటూ రోజులు లెక్కపెట్టుకుంటూ గడుపుతున్నారంతా.

"పైదమ్మా! పైదమ్మా!" స్టాఫ్ నర్స్ వరండాలోకి వచ్చి బిగ్గరగా అరిచింది

"వస్తున్నానమ్మా" పక్కవార్డులోనుండి పరుగున వచ్చిందో నలభైయ్యేళ్ళ మనిషి.

"ఏమిటి పైదమ్మా! ఎన్నిసార్లు చెప్పినా బుద్ధిలేదేంనీకు! ఆ మంచం మీద మనిషినలా వదిలేసి నీ యిష్టం వచ్చినట్లు షికార్లు కొడుతున్నావ్. ఆ సెలైన్ చూడు ట్యూబులూజై ఎలా కారిపోయిందో ఈ సారి మంచం వదలి కనిపించు నీ పని చెప్తాను. స్టాప్‌నర్సు గదమాయించగా అంటూ తన సీటుదగ్గ వెళ్ళిపోయింది.

" ఈ దిక్కుమాలినోడు చచ్చిపోయినాబాగుండేది దేముడో! ఈడి జబ్బు నా చావుకొచ్చింది నాయనోయ్! బిగ్గరగా ఏడుస్తూ విసురుగా వాడి చెయ్యి

కదలకుండా పట్టుకుని దబ్బుమని నేల మీద కూర్చుంది పైడమ్మ. స్టాఫ్ విసురుగా బైటకువచ్చి "ఛీ! నో ర్కమ్ యూ" గర్జించినట్టు అనే సరికి టక్కున నోరు మూసుకుని కళ్లు తుడుచుకుంటూ కూర్చుంది.

వింటున్నలీల, అత్తగారు లలితమ్మ కొయ్యబారిపోయారు పైడమ్మ మాటలకు. లీల కుతూహలంతో పైడమ్మ భర్త వివరాలడిగింది.

పైడమ్మ భర్త నారయ్యకు క్రింది దవడమీద కాన్సర్ వచ్చింది. ( Hemi - Mandibulectomy ) హెమీ మాండిబులెక్టమీ చేశారు. వారంరోజులనుండి షాక్‌లోనేవున్నాడు. అతని కండిషన్ అసలేమీ బాగలేదు ఎప్పటికప్పుడు బ్లడ్, సెలైన్ ఎక్కిస్తూనే వున్నారు. ఆఖరికి ఇంజక్షన్స్ చేసినచోట కూడా ఇన్‌ఫెక్ట్ అయిపోయింది

"ఏమిటమ్మాయీ! అలా మాట్లాడతావు? కట్టుకున్నవాడు యింకా చావలేదని ఏడుస్తున్నావా? అలా ఏడుస్తుంటే అతనికేం బాగుంటాడు. భర్తను జాగ్రత్తగా చూసుకుంటూ పసుపు కుంకుమ నిలబెట్టమని దేముణ్ని కోరుకోవాలి. మా కోడల్ని చూడు. వాడిప్రక్క ఒక్క నిముషమైనా వదిలిపెడుతోందా? అన్నీ దగ్గరుండి చూసుకుంటోంది". లలితమ్మ చావస్తంగా పాతివ్రత్యధర్మాన్ని ఏకరువు పెడుతోంది.

"చాల్లేవమ్మా! మహా చెప్పొచ్చావ్" కళ్ళు తుడుచుకుంటున్న పైడమ్మ నిరసనగా అంది "పూట పూటా నాకూ ఎవరైనా అన్నం తెచ్చిపెట్టి బ్రతిమాలి పెడితే, నేను మా ఆయనకి యింతకంటే బాగానే సేవ చేయగలను" వ్యంగ్యంగా అని అంతలోనే భోరుమని ఏడుపు ప్రారంభించింది.

"మీకేంతల్లీ కలిగిన మా రాజులు మా పాట్లు మీ కేం అర్థమవుతాయ్. వారంరోజులైంది నేను అన్నంతిని. మొన్నటిదాకా కుళాయినీళ్ళతోనే కడుపు నింపుకున్నాను. మొన్నటినుండి రోజూ మధ్యినేళ అల్లా వార్డులోకిపోయి వాళ్ళు తినేసిన పళ్ళాలలో అన్నం దేవుకుని తింటున్నాను కాస్త పక్కకెళ్తే పాలు నర్సమ్మ గయ్యిమంటోంది. టీ తాగుదామన్నా నాదగ్గర ఎర్రని ఏగానితేదు. మరి నేను ఎలా బ్రతుకుతాననుకుంటున్నారు. పోనీ యీడైనా బతికి బట్టకడతాడా అందే అంటే ఆ ఆశలేదు. వీడు చస్తే నాపొట్ట పోసుకోడానికి నాకెలాగా వుంటుంది వీడుచచ్చినోడుకాదు, బతికినోడుకాదు. మధ్య యిదంతా నా చావు కొచ్చింది." అంటూ బోరుమనిఏడ్చింది.

లీల నిర్ఘాంతపోయి అలానేకూర్చుండిపోయింది. తను ఎంత అదృష్టవంతురాలు. భర్తమీద అభిమానం, ప్రేమవెల్లడించుకోగల అవకాశం దొరికింది. పాప మావ్యక్తికి భర్తమీద ప్రేమకంటే ఆకలి మంటలే ఎక్కువ. ఎంతటి కఠినసత్యం. తను అంతవరకూ ఇద్దరూ కష్టపడి సంపాదించినదంతా ఏదో బ్రతుకుతాడనే ఆశతో ఈ ఇరవైరోజులనుండి ఖర్చు పెట్టేసివుంటారు. ఇక డబ్బూ లేదు, భర్త బ్రతుకుతాడనే ఆశ లేదు. తనుబైటికి వెళ్ళి కూలీచేసుకునే అవ

కాళమూ యుప్పల్లోలేదు. ఏ బాధ అయింది.
నైనా వెలిబుచ్చడానికైనా ఆర్థికస్థితి "ఉన్నవాళ్ళ బాధ అగాధ సముద్రం
ఎంత ముఖ్యమో లీలకు కళ్ళకు కట్టినట్టు లేని వాళ్ళ బాధ అగ్ని పర్వతం"

---

## ముందు చూపు

భూమి తనచుట్టూ తను తిరుగుతూ
తనశరీరం కొంత మండుతున్నా
భగభగ మండే సూర్యునిచుట్టూ
పరుగెత్తుతూనే ఉంటుంది
మొత్తంశరీరంలోవసంతాన్ని నింపడానికి

ప్రియుడు
తన మనసును కొంత చీకటి
ఆవరించుకుంటున్నా
బెట్టుసరిచేసే ప్రియురాలి చుట్టూ
తిరుగుతూనే ఉంటాడు
జీవితమంతా వెలుగు నింపుకోడానికి

ప్రజలు
తమలో కొందరి జీవితాలు
ఆహుతి అవుతున్నా
ఆగకుండా ప్రజ్వరిల్లే విప్లవంకోసం
ఎగబడుతూనే ఉంటారు
అందరి జీవితాలు
ఆహుతికాకుండా ఉండడానికి.

— సుంకిరెడ్డి నారాయణరెడ్డి

## తలలు

చెదరిన
పుట్టనుండి
చెదరిన చీమలు
పరుగులెత్తినట్లు
లేమికొలిమినుండి
ఆకలిపొగలెగబడినప్పుడు
ఆకలి తీర్చలేని
మంచినీళ్ళుకూడా
అసహాయతతో
మెడబడతాయి.
తడబాటులో
పొలమారిందని
మీతలలమీద మీరే
బాదుకుంటున్న
అన్నార్తుల్లారా!
బాదవలసిన తలలు
వేరేఉన్నాయని
తెలుసుకునేదెప్పుడు ?

— శిఖామణి

# ముప్ఫై సంవత్సరాల వియత్నాం కవిత్వం

## మూలం : గ్యువాన్ డ్యూ అనువాదం : ఎస్వీ. సత్యనారాయణ

వియత్నాం ప్రజానీకానికి తరతరాలనుండీ సాహితీ సాంప్రదాయముంది. వారు ప్రత్యేకంగా కవిత్వాన్ని ప్రేమిస్తారు. ప్రఖ్యాతకవి న్యూయెన్ డ్యూ యొక్క 200 జన్మదినం (1965) సమస్తమానవజాతిచేత జరుపబడింది. అతడే మాజాతికి గర్వకారణం. అతడింకా చిరంజీవి. అమెరికా వ్యతిరేకోద్యమంలో విరచించిన అతని కవిత్వంలో అతనింకా జీవించియేవున్నాడు. దీనికి నిదర్శనంగా ఈ నాటికీ ప్రతి వియత్నాం వీరుడూ పోరాటంలో ఉత్సాహాన్నీ, చైతన్యాన్నీ కలిగించే అతని కవిత్వాన్ని మననం చేస్తుంటాడు.

తరతరాలుగా వేలాది సంవత్సరాలుగా మాకవిత్వం మాజాతి సంచయంగా సాంప్రదాయ కవిత్వంగానూ, జానపద కవిత్వంగానూ వృద్ధిచెందుతోంది. ఇది ఆగస్టు విప్లవంలో కొత్త చైతన్యాన్ని పొంది ప్రజాస్వామిక వియత్నాంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం సాగుతున్న మా దీర్ఘకాలిక పోరాటంలో శక్తివంతమైన ఆయుధంలా గత ముప్ఫై సంవత్సరాలుగా అభివృద్ధిచెందుతోంది.

వియత్నాం ఎప్పుడూ కవిత్వానికి కేంద్రస్థానంగానే ఉంటూ వచ్చింది. జీవితంపై ప్రేమ యుగాలుగా చారిత్రిక ప్రమాణాలుగల మాదేశం ఇప్పటికీ నిత్య నూతనంగా ఉంది. దీని సంస్కృతి అతి ప్రాచీనమైనదీ, సాంప్రదాయసిద్ధమైనదీ అయినప్పటికీ శతాబ్దాలుగా ఫ్యూడలిజంయొక్క, ఫ్రెంచి వలసవాదంయొక్క పాలనలవల్ల సంక్రమించిన సంకుచితమైన అలంకారాలు దీన్లో చోటుచేసుకున్నాయ్. అందువల్లే ఇంకా వియత్నాంయొక్క ఆర్థికసంపద వ్యవసాయమ్మీదే ప్రధానంగా ఆధారపడిఉంది. ప్రగతి మార్గంలో ఎన్నో విస్తబ్ధతలూ, అంతరాయాలూ ఉన్నప్పటికీ మా ప్రజల్లో జీవితంపట్ల ప్రేమ క్రమంగా పెరుగుతూనేఉంది. వారు అత్యున్నతమైన విలువైన జీవితాన్ని కోరతారు. ఇదెలా ఉంటుందంటే ఇద్దరు వ్యక్తులు ఒకరి పట్ల ఒకరు ప్రబలమైన అనురాగాన్ని కలిగి ఉన్నట్లుంటుంది. ఎన్ని అవరోధాల్ని ఎదుర్కొంటూరో అంతగాఢమైన అనురాగాన్ని కూడా వారు అనుభూతి చెందుతారు. ఈ అనుభూతిని ఏ శక్తి అడ్డగించలేదు. ఒక యువకుడు అప్పుడే జీవన చక్రంలోకి ప్రవేశించినట్లుగా మేం జీవితాన్ని విశ్వశిస్తాం. ఈ జీవితంపట్ల ప్రేమ అనే అంశంతోనే మా హృదయాలు నిండిపోయివుంటాయి.

బాంబుల మరకలతో నిండి వున్న దేశంమాది. దీని ముఖ్యపట్టణం 1972లో అమెరికా బి - 52 బాంబర్లచేత వరుసగా రెండువారాలపాటు గాయపరచబడింది.

ప్రపంచంలోకెల్లా అత్యధికంగా యుద్ధాలవల్ల ధ్వంసం చేయబడ్డ నేల అయినప్పటికీ మానవానుభూతులకు పెట్టిందిపేరిది. ప్రగాఢమైన మానవానుభూతులు, ఉన్నత మైన ఆలోచనలు కలిగిఉన్నాం కాబట్టి ప్రశాంతంగా ఉండలేక పోతున్నామేమో. మా పోరాటంలోనూ భయంకరంగా పోరాడలేకపోతున్నామేమో.

వియత్నాం పచ్చికబీళ్ళు చాల అందమైనవి. ఈ నేల నాలుగు రుతువు లందెప్పుడూ సస్యపరిమళంతో గుబాళిస్తుంటుంది. ఈ నేల మూడువేల కిలో మీటర్లు అహోరాత్రులు సముద్రకెరటాలవల్ల, గాలి దుమారాలవల్ల ఒక దీర్ఘమైన బీడు భూమిగా మారిపోయినప్పటికీ ఈ ప్రకృతి దట్టమైన కీకారణ్యంగాగాదు, ఒక సుందరమైన, రమణీయమైన ప్రదేశంగానేఉంది.

వియత్నాం ప్రజానీకం సర్వదా పోరాటం చేస్తూనే ఉంది. తుఫాన్లతోనో, వరదలతోనో, కరువుకాటకాలతోనో పోరుసల్పుతూనేఉంది. ఉత్తరంనుండి దక్షిణానికి గల విశాలమైన మా భూమిని సారవంతం చేయడానికి మా వాళ్ళెంతో కష్టపడవలసిఉన్నది. వీటన్నింటినిబట్టి పరిశీలిస్తే శతాబ్దాలుగా కొనసాగుతున్న మా వారి బాధలూ, దైన్యాలతో కూడిన సంఘర్షణ తెలుస్తోంది. వీటితోబాటు వారు వారి స్వాతంత్ర్య పరిరక్షణకోసం వేలాది సంవత్సరాలుగా పోరాడవలసివస్తూనే ఉంది. ఇదొక సుదీర్ఘమైన కష్టతరమైన పోరాటం. ఇదే మాలో ఉన్నతమైన అనుభూతుల ఇంధనస్సును ఆవిష్కరించింది. ఇదే ఈ వియత్నాం కవుల కవిత్వంలో లోతైన వేళ్ళను తన్నుకువిడింది.

ప్రజాస్వామిక గణతంత్ర వియత్నాం ప్రభుత్వమేర్పాటయిన వెన్వెంటనే జీవితానికీ, పోరాటానికీ దోహదంచేసే కవిత్వ యొక్క ఆశ్యకతని గుర్తించామ్మేం. అందుకే ఈ ముప్పై సంవత్సరాలుగా కవితాసంకలనాలను - గెరిల్లాలు, సైనికులు పార్టీ మరియు ప్రభుత్వ అధికారులు ఎప్పుడూ చైతన్యవాహకాలుగా వెంటబెట్టు కుంటారు. ఇది నిజం-1945 నుండి 1954లో డీన్ బీన్ ఫో వద్ద మేం సాధించిన విజయం వరకూ సంవత్సరాలుగా ఫ్రెంచి వలస వాదానికి వ్యతిరేకంగా సాగిన ఉద్యమకాలమిది. ఇదికూడా నిజం - తిరిగి, సంవత్సరాలుగా మాపై జరిగిన దురాక్రమణలని మేం ఎదుర్కొనడంలో అమెరికా జోక్యంవల్ల జెనీవా ఒప్పందంద్వారా వియత్నాం ఉత్తర, దక్షిణాలుగా విభజింపబడినది. 1965నుండి 1968 నడుమ జాన్‌సన్ యుద్ధవిరమణకాలంలోను, 1972లో నిక్సన్ యుద్ధవిరమణ కాలంలోను 1973లో పారిస్ ఒప్పందాల్ని అమలు పరచేందుకు జరుపుతున్న పోరాటంలోనూ మేం మా దేశానిర్మాణానికి చెమటనిధారపోశాం. దేశ పరిరక్షణకి రక్తాన్ని సమర్పించాం. ఈ కఠినతరమైన కష్టాలలోనూ, నిత్య జీవితావసరాల కొరతల్లోనూ, నష్టాల్లోనూ మా కవిత్వంలో ఆహ్లాదకరమైన గొంతులే వినబడుతున్నాయి ఎందు కంటే దాన్నిండా విప్లవ ఆశావాదం నిండి ఉంది గనుక.

1945 ఆగస్టు విప్లవానికి ముందు మా కవులు అనేక బాధామయమైన గీతాల ద్వారా, ఆధిక్షేప కావ్యాలద్వారా, చీకటిమయమైన భావచిత్రాలద్వారా, వేదనా ధ్వనులద్వారా తమ "జీవితం పట్ల ప్రేమ"ని వ్యక్తం చేశారు. ఇది వారి ఆలోచనలను, అత్యధిక ప్రాధాన్యతగల అభిప్రాయాలను బహిర్గతం చేయడానికి దోహదం చేసింది. ఆ రోజులు గడిచిపోయిన తర్వాత ఈ గీతాలు కొన్ని సమాజంతోనూ, వాస్తవిక జీవిత తోనూ చాలా దూరమయిపోయినవి: కొన్ని వాస్తవికతని విచ్ఛిన్నంకూడా చేశాయి.

అందుకే మొదటి విప్లవానంతరకాలం - అంతఃకరణాన్ని బహిర్గతం చేసే మానవాత్మని పునర్నిర్మించడానికి అధిక శ్రమని ధారపోసినకాలంగా గుర్తింపబడుతున్నది. కాబట్టే ఈ విప్లవం - కవిత్వమనే మొక్కని తిరిగి నేలలో నాటడానికి దోహదంచేసింది. అప్పట్నించెప్పుడూ కవిత్వం - వాస్తవిక జీవితానికి ఏ మాత్రం దూరం కాలేకపోగా, ప్రజలమధ్య - ప్రముఖమైన సంఘటనల మధ్య ఎల్లప్పుడూ వినబడుతూనే ఉంది. శత్రునిర్మూలన గురించి కవిత్వంరాయబడింది. కొండల్నీ గుట్టల్నీదాటిన గెరిల్లాల ప్రస్థానంకోసం కవిత్వంరాయబడింది వీరభూమిని గురించి నల్లబొగ్గునీ - తెల్ల ఉప్పునీ తయారుచేయడం గురించీ మా వాళ్ళు కథలు కథలుగా చెప్పేవారు. కవిత్వంరాసేవారు. ప్రజలెలా అధ్యయనం చేసేవారో లూనార్ కొత్త సంవత్సరంలో కేక్స్‌ని ఎలా తయారు చేసేవారో మున్నగు అంశాల్ని కొన్ని కవితలు వర్ణించేవి. ఈ రకంగా కవుల హృదయాలనీ, మేధలనీ వాస్తవిక జీవితం మోసుకువచ్చేది. వీటన్నింటితోబాటు "ఒక్కొక్కరూ తమ తమ స్వంత ప్రతిభలను నిలుపుకోండీ, అభివృద్ధి చేసుకొండీ" అంటూ ప్రధానమంత్రి ఫాం వాన్ డాంగ్ - కవులకూ, వచన రచయితలకూ చేసిన హెచ్చరిక, కలిగించిన ఉత్సాహం ప్రధానమైనది.

మరొక ముఖ్యమైన విషయమేమిటంటే - "మా కవిత్వం కాలానుగుణంగా పరిణామం చెందుతూవచ్చింది. 1945 తర్వాత నిరక్షరాస్యులైన వ్యవసాయదారులు జనాభాలో అధిక సంఖ్యని ఆక్రమించారు. కాని యిప్పుడిప్పుడే మా యువ సైనికులు, అమెరికా విమానాలను భూమార్గం పట్టించిన తర్వాత సున్నితమైన యంత్రాలను ప్రయోగించేందుకు గాను వారు సెకండరి స్థాయివరకు విద్య నభ్యసించారు. విప్లవంతో బాటు సాహిత్య ప్రపంచంలోకి అడుగు బెట్టిన కవులు - అక్షర జ్ఞానం లేని స్త్రీ పురుషుల హృదయాలను కూడా కదిలించ గల కవిత్వం రాయడం నేర్చుకున్నారు ఈ కవులు - ప్రజల మధ్యఉంటూ, ప్రజలు సులభంగా నేర్చుకోడానికి, గుర్తుంచు కోడానికి అనువైన జానపద బాణీల్లో కవిత్వం రాశారు.

క్రమేణా అమెరికా వ్యతిరేకోద్యమ కాలంలో విభిన్న మార్గాలు పొడ సూపినాయి. ఉన్నతమైన సాంస్కృతిక విలువల్ని ప్రజలు సంపాదించుకోగలిగారు. కాబట్టే

విభిన్న రకాల కవితా రీతులు ఆవిర్భవించడానికి అవకాశం కలిగింది - ఇప్పుడు మా కవులు -నాలుగు నుంచి ఇరవై చరణాలు గల విభిన్న ఛందో మార్గాలను అవలంబిస్తున్నారు.

ఏది ఏమైనప్పటికీ ఎల్లప్పుడూ మా కవులు -వియత్నాం భాషా స్వచ్ఛతని పరిరక్షించేందుకు గాను తమ శక్తుల్ని సమర్పిస్తూనే ఉన్నారు. ఇక్కడ ఫాంవాన్-డాంగ్ గారి అభిప్రాయాన్ని పునశ్చరణ చేసుకుంటే -"ఒక పరిశుద్ధమైన భాషా స్వచ్ఛత -కవిత్వానికీ, ప్రజలకీ మధ్య వారధి" అని తెలుస్తోంది. ఇదే సంప్రదాయ కవుల్ని గొప్ప కవులుగా నిలబెట్టింది.

ఇప్పుడు ప్రధానంగా 'నవ్యకవిత్వం' లేదా 'ఆధునిక కవిత్వం' గురించి చర్చవినబడుతోంది అయితే ఇది వియత్నాం భాషా సంపదనుండి, సుందరమైన, సంగీత బద్ధమైన ఛందస్సు నుండి ఎలా విడివడ గలుగుతుంది.

దక్షిణ వియత్నాంపై అమెరికా దురాక్రమణ, ఉత్తర వియత్నాంలో యుద్ధం సంభవించిన నాటి కాలంలో దేశంలోని అన్ని ప్రాంతాలూ గాయపడ్డప్పుడు సైతం మా కవిత్వంలో- "జీవితం పట్ల ప్రేమ" ప్రతిధ్వనించసాగింది.

విభజనని ఎదిరించి బలంగా పెరిగే ప్రేమవలె జీవితం ఉన్నతమైన సంగీత ధ్వనితో

ప్రకాశవంతమైన జ్వాల వలె పేలుతోంది చూడు- మాశరీరశ్రమని ధారవోశాం.........

మా పొలాలు పచ్చని పైర్లతో-
ధాన్యపు గింజలతో నిండాయి-
మా జీవిత రక్తాన్ని సమర్పించాం....
మా దారులు ఉత్తర దక్షిణాల్ని కలుపుతున్నాయ్-

స్వాతంత్ర్య సైనిక యోధుల ప్రస్థానాన్ని. లాంగ్ట్ర్వాంగ్ సన్ పర్వత పంక్తులపై హోచిమిన్ ప్రయత్నాలని కవిత్వం అభివర్ణించింది.

నిక్సన్ యుద్ధవిరమణకాలంలో "ది వ్యాన్ గే" (లిటరేచర్ & వార్) వార పత్రిక వారు నిర్వహించిన కవితా పోటీ కోసం దాదాపు మూడువేల మంది యువ రచయితల నుండి ఇరువై ఎనిమిది వేల కవితా ఖండికలొచ్చాయ్.

ఉష్ణమండల ప్రాంతాల్లో మొక్కలు చాలా త్వరితంగా పెరుగుతాయ్. బాంబుల్తో గాయపడ్డ ప్రాంతాలు సైతం కొన్ని రోజుల్లోనే వృక్షాల్తో, పొదల్తో ఆవరించుకు పోయి బంగారు భూములుగా మారతాయ్. దీని కంటే వేగంగానే యువ సైనికులు, ఉత్సాహవంతులైనయువజన కార్యకర్తల బృందాలు - యుద్ధం వల్ల ధ్వంస

మయిన దేశాన్ని సుసంపన్నం చేస్తూ పునర్నిర్మిస్తారు. వాళ్ళు చేస్తున్న కార్యకలాపాలకి వాళ్ల హృదయాలన్నీ, ఆత్మల్నీ సమర్పణం చేస్తారు. అందుకే వాళ్ల కార్యాలు విజయ నాదాలు. వాళ్ల కవిత్వాలు సజీవ చైతన్యాలు.

"ఇక్కడి గీతాల ధ్వనులు -బాణాల ధ్వనుల్ని మించెత్తి వేస్తాయి" అన్నది వాళ్ల నినాదం. వాళ్ళ హృదయాలు ఉత్సాహంతో గానం చేస్తాయి... వాళ్ళ అభిప్రాయాలనూ, ఆలోచనలనూ వ్యక్తం చేస్తాయి.

పైన పేర్కొన్న కవితా పోటీలో -మొదటి నాలుగు బహుమతుల్లో మూడింటిని ఈ యువయోధులే గెలుచుకున్నారు. ప్రథమ బహుమతి పొందిన "హువాంగ్ సుహోమ్ఘూం" గేయ భాగమిది —

"మా బాల్యపు పాలరాళ్లు విసరేయబడి...
నష్టపోయినా
సికడా వాద్యాన్ని వాయించే కాలంలో
మేం ముందు నడుస్తాం —
పరిణతి చెందిన సంగీత వాద్యాల్లో సైతం
ఒకటో ...రెండో...లేదా...మూడో...
సికడా స్వరాలుంటాయంటే—ఎవరు కాదనగలరు?"

తమ బాల్యంలో వాయించి, ఆనందించి నట్లుగా ఇప్పటికీ యువ నికులు సికడాలని వాయిస్తుంటారు. చిన్న పిల్లలకి మల్లే ఇప్పటికీ ఆనందోత్సాహాలతో పరవశించి పోతుంటారు.

మొత్తంమీద ఈ ముప్పై సంవత్సరాల వియత్నాం కవిత్వం ఇప్పటికీ యవ్వనంలో ఉంది. ఇక్కడ ప్రసిద్ధులైన కవులను గురించో, మనోహరమైన కవితా ఖండికల జాబితాలను గురించో రాయాలని కాదు నా ఉద్దేశ్యం. ఎప్పుడూ మా ప్రజల కుండే "జీవితం పట్ల ప్రేమ" "కవిత్వం పట్ల ప్రేమతో" ఏ విధంగా పెనవేసుకుపోయిందో వివరించడానికే ఈ ప్రయత్నం

స్వేచ్ఛ-స్వాతంత్ర్యం-ఆనందాలలో కూడిన జీవన సముద్రం వేపు ప్రవహిస్తున్న జీవనది మా కవిత్వం

---

# జగన్నాథుని రథచక్రాలు

కథానిక

— బి. సాయిప్రణవ

గూడెం వాతావరణం అంతా హడా విడిగా ఉంది. అక్కడ నివసించేది అందరూ కూలీనాలీ చేసుకునే పాటక జనమే గూడెం మధ్యగా ఓ వేపచెట్టు ఉంది. ఆ చెట్టు కింద ఉన్న గట్టుమీద కుంటి కోటిగాడూ, ముసలి అవ్వా, గుడ్డి రామదాసూ ఉంటారుఎప్పుడూ. ఇవాళ అక్కడేదో మీటింగు ఉందని వాళ్ళని అక్కడి నుండి తరిమేసారు

వేపచెట్టు కింద పందిరేసారు. రంగు కాగితాల్తో తోరణాలు కట్టారు. మైకు పెట్టారు.

ఈ తతంగమంతా చూస్తూ. కుతూహలంగా అడిగింది అవ్వ "ఏటిరా! కోటిగా! ఏటి సేస్తారేటి ఈడ?"

"ఎన్నికలొస్తన్నాయి గందా? పచ్చ జెండా పార్టీ వోళ్ళు మీటింగెడతారంటనే అవ్వా" కుంటి కోటిగాడు చెప్పాడు,

అవ్వ మొహం చిట్లించింది, "ఎన్నికలంటే ఏటిరా?"

"అదేనెసె! మన రంగడు పుట్టినప్పుడు మనూర్లో జెండా ఐకి వాడికి నిన్ను రిచ్చా బండిలో కూకోబెట్టి తీసికెళ్ళి కాగితం ముక్కమీన ముద్దరేయించి పెట్టిలో వేయించినారే! మన నాయుడు గారు పదిరూపాయలు ఇచ్చినారు గందః! అయి మళ్ళా వచ్చినాయంట అందుకే పచ్చ జెండా వోళ్ళు మీటింగు ఎడతారంట"

"ఓరినీ పదిరూపాయల పండగా?మరి గట్టయితే ఇంతా ఈమట్టికి రూకలివ్వలేదేందిరా?"

కోటిగాడు సమాధానం చెప్పేలోగానే మీటింగు వోళ్ళొచ్చేశారు. అందరి చేతిలోనూ పచ్చ జెండా లున్నాయి.

"పచ్చ జెండాకే మీ ఓటు ముద్ర వేయండి. పచ్చ జెండాని గెలిపించండి. పచ్చ జెండాకీ జై" అందరూ అరుస్తున్నారు.

మీటింగు మొదలయింది.

"సోదరులారా! మనం ఇప్పుడు చాలా క్లిష్ట పరిస్థితుల్లో ఉన్నాం. ధరలు ఆకాశానంటుతున్నాయి. అందరికీ సరయిన తిండి లేదు. బట్టలేదు. ఉంటానికి ఇళ్ళు లేవు. ఈ కనీసపు అవసరాలు తీరాలంటే మా పార్టీకే మీ ఓటువేయిండి. ఇన్నాళ్ళూ మీరు చీకటిలో బతికారు. ప్రాథమిక హక్కులకి కూడా పోరాడవలసి వస్తోంది. స్వేచ్ఛగా గాలి పీల్చటానికి కూడా ఆలోచించే గతిపట్టింది. స్వతంత్రంగా మాట్లాడే హక్కుని కూడా దోచేసిన ఈపార్టీని దించెయండండి. సింహాసనం మీద స్థానం పటిష్టం చేసుకుంటోందే తప్ప ప్రజల కనీసపు అవస

రాలు కూడా ఇప్పటి అధికారవర్గం వారు చూడటం లేదు. ఇన్నేళ్ళు పరిపాలించినా మనిషికి కావల్సిన పట్టెడన్నం, బెత్తెడు గుడ్డా, జానెడు కొంపా ఇవ్వలేని ఈ ప్రభుత్వం మీద మీరు ఇంకా నమ్మకం పెట్టుకోవద్దు మీ బాధ్యత తెలుసుకుని ఓటువేయండి. మీ ఓటు దుర్వినియోగం చేసుకోవద్దు, మీ ఓటు మీదే మీ జీవితపు నిశ్చింత ఆధారపడిఉంది. అందుచేత ఇప్పటికయినా మీరు కళ్ళు తెరవండి. మాకు ఓటు వెయ్యండి, పచ్చ జెండాని గెలిపించండి"

"బాబూ! మీకు ఓటేస్తే కిలో బియ్యం రూపాయి కిప్పిస్తారా? "-ముందు వరసలో కూర్చున్న కోటిగాడు అడిగాడు.

"ఓ! తప్పకుండా! మీరు ముందు మమ్మల్ని గెలిపించండి. మీ ఓటు మాపార్టీ కెయ్యండి."

"బాబూ! కిరసనూనె చౌగ్గా పోయిస్తారా? గుడిసెలో దీపవెట్టుకోవడానికి?" అవ్వ అడిగింది. ఎన్నాళ్ళ నుంచో తన గుడిసెలో దీపం వెలిగించుకోవాలని అవ్వ కోరిక.

"ఓ అలాగే! ముందు మాకు ఓటెయ్యండి"

మిగతా వాళ్ళకి కూడా ఉత్సాహం వచ్చింది "బాబూ మా గూడెంలో ఎలక్ట్రీ దీపం లేదు ఎట్టించండి బాబూ!"

"బాబూ నీటి చుక్క కోసం రెండు మైళ్ళు పోతున్నాం మా గూడెంలో నీళ్ళ పంపు ఏయించండి."

తలొకటి అడగడం మొదలెట్టే సరికి మీటింగ్ చెప్పేవాడు కంగారు పడ్డాడు,

"అలాగే, ముందు మాకు ఓటెయ్యండి" అని చెప్పి వేదిక దిగిపోయాడు.

కొంచెం సేపున్నాక ఇంకో పార్టీ వాళ్ళొచ్చారు. వాళ్ళ గుర్తు తెల్లజెండా. వాళ్ళూ మీటింగ్ చెప్పారు, సోదరులారా ఎన్నో సంవత్సరాలనుంచి దేశం పాలిస్తూ స్థిరపడిన పార్టీ మాది. మావన్నీ స్థిరమైన నిర్ణయాలు స్వచ్ఛమైన ఆశయాలు. దేశంకోసం ఎంతోమంది మా పార్టీవాళ్ళు త్యాగంచేసి అమూల్యమైన సేవచేశారు, చేస్తున్నారు. స్వసుఖాలను వదలుకుని ప్రజలకోసం జీవిస్తున్న మాకు ఓటువేసి మా పార్టీని గెలిపించండి. స్థిరమైన నిర్ణయాలు, అభిప్రాయాలూ లేని పార్టీలని నమ్మకండి. నమ్మైక్యతలేని ఏపార్టీకూడా ప్రజలబాగోగులు చూడటానికి బలహీనమైనవి. అందేత ప్రజలారా! ప్రజల అవసరాలు మాకు తెలుసు, మేము ప్రజల కోసమే జీవిస్తున్నాం. మాపార్టీ సుస్థిరమైనది మీ ఓటు మాకే వేసి గెలిపించ ప్రార్థన. తెల్ల జెండాకే మీ ఓటు."

రోజూ ఒక పార్టీతర్వాత మరొక పార్టీవచ్చి మీటింగులు చెపుతున్నారు.

ఎన్నికలు జరిగాయి. పచ్చజెండాల వాళ్ళు గెలిచారు.

గెలిచిన ఉత్సాహంతో పచ్చజెండాల వాళ్ళు ఉత్సవాలు జరుపుకున్నారు.

రోజులు గడుస్తున్నాయి. దేశమంతా మార్పుకోసం ఎదురుచూస్తోంది. ప్రజల జీవితంలో పచ్చజెండాల వాళ్ళు తెచ్చే 'బాగుని' చూద్దామని రోజూ సూర్యుడు ఉత్సాహంగా ఉదయిస్తూ, నిరాశతో మళ్ళీ కుంగిపోతున్నాడు.

గూడెంలో ఎలక్ట్రిక్ పోల్ వెలిసింది. నీటిపంపుకోసం గోతులు తవ్వారు. వెలగబోయే దీపం కోసం, రాబోయే పంపుకీళ్ళకోసం, గూడెం ప్రజలు ఎదురు చూస్తూనే ఉన్నారు.

ఆకలితో డొక్కమాడుతున్న అవ్వ ఒకసారి అరచేత్తో పొట్టమీద రాసుకుంది.

ఏ జెండావోళ్ళు గెలిసినా ఏ పారిటీ వోళ్ళు రాజ్యాని కొచ్చినా తను అడుక్కోక తప్పదని మరోసారి ఋజువు చేసుకుంది నిండా నూరేళ్ళు నిండిన ముసలి అవ్వ చట్టితీసుకుని పచ్చ జెండా వాళ్ళు తమకి రూపాయికివ్వబోయే కిలో బియ్యం గురించీ, చవగ్గా కిరసనూనె తమకందరికీ ఇస్తే, తన చీకటి గుడిసెలో తను రోజూ వెలిగించబోయే దీపం గురించీ, తమ గూడెంలో రాబోయే పంపుకీళ్ళ గురించీ, వెలగబోయే ఎలక్ట్రిక్ దీపం గురించీ కలలుకంటూ పిడికెడు అన్నం కోసం ఓ ఇటిముందు నిలబడింది అవ్వ.

ఎక్కడినుంచో పాట వినిపిస్తుంది.

"పతితులార! భ్రష్టులార! దగాపడిన తమ్ములార! ఏడవకండేడవకండి ... వస్తున్నాయొస్తున్నాయి. జగన్నాథుని రథ చక్రాలొస్తున్నా యొస్తున్నాయి ...

---

# శివ నేత్రం

భీకరతర
ఘోరారణ్యం
చిక్కదార్లు
చిదుముదులా ...
(అయితేనేం)
ఆ సరిహద్దున
మంత్ర గత్తె
ఎర్ర చూపు పహారా ....
ఈవలొద్దు
"రాచ" పుండు
దొలేసిన ... సహారా ...
[అయితేనేం]
దిక్కు లేని
ధాత్రిమేయు చీకటి పొద కోణంలో ....
రాజుతూన్న
వెలుగు మంట ....
వినిపించే
ఋూరాధ్వని
శివనేత్రం ... కార్చిచ్చా
ఈ గాడ్పులు
ఆ ఊర్పులు
కనలి కనలి కాల్చే యును ...
మసలి మసలి పేల్చే యును ...

— నీ హారిక

# అనాలోచితమైన నిందా వ్యాసం

**చర్చా వేదిక** — **అవంతి**

"మధ్యతరగతి నీచత్వం. లేక అవ లక్షణాలు" అంటూ అక్టోబరు అభ్యుదయలో వచ్చిన వ్యాసం చూసేక చాల ఆశ్చర్యం కలిగింది. వర్గాలు, దోపిడి, దురాచారాలు, మొదలైన శబ్దాలను ప్రయోగిస్తేచాలు మార్క్సిస్టుగా, అభ్యుదయవాదిగా చలామణీ అవుతామనే భ్రమతప్ప ఆ వ్యాసం కూర్పడానికి పద్ధ్రమ దుస్సాహసమనే అనాలి. అభ్యుదయ సంపాదకులుకూడా అటువంటి భ్రమలోనే వున్నారా?

రచయిత పేర్కొన్న అవలక్షణాలలో ఒకటి వారు తమ సంతానాన్ని తమ తాహతుకు మీరిన చదువులు చెప్పించడానికి తాపత్రయ పడుతున్నారన్నది.

ఇది మధ్య తరగతులొక్కరికే పరిమితమైన 'అవలక్షణం' కాదు. మానవ జాతిలోనే ఈ 'దుర్లక్షణం, వుంది. మానవజాతి ఈనాడు సాధించిన పురోగతి సాంస్కృతికంగా, వైజ్ఞానికంగా - ఇటువంటి అవలక్షణాల ఫలితమే

మధ్యతరగతులు ఈనాడు తమపిల్లలచేత పెద్దచదువులు చదివించాలని నానా యాతనలు పడుతున్నమాటనిజమే. తల్లిదండ్రులు ఆ చదువులకై సర్వస్వం - ఆస్తులు, ఆరోగ్యాలుకూడ - వడ్డుతున్నారు. ధనంలేదు కనక విద్యారంగాన్ని ధనికుల సంతానానికి వదిలివేసి మధ్యతరగతులూ, దిగువ వర్గా స్థితి అంతకన్న అధ్వాన్నంకదా - అందుచేత వారూ తమ సంతానాన్ని అవారాలుగా వదలడం సల్లక్షణం అవుతుందా? మనుష్యుడు తానున్నచోటనే ఉండాలనుకోడు. తాను సుఖ పడాలనుకొంటాడు. ఈనాడు సోషలిస్టు వ్యవస్థరావాలనీ, కమ్యూనిస్టు సమాజం తేవాలనీ లక్షలాదిమంది ప్రాణత్యాగాలకు కూడా సిద్ధమవుతున్నదెందుకు? ఈ ఈ త్యాగం చేస్తున్నవారిలో ఏ ఒక్కరికన్నా ఆఖరికి మార్క్సు లెనిన్‌లకుకూడా ఈ రచయిత ఆశించిన ఆర్థిక అర్హతవుందా?

తమ కొడుకుల్ని మంచి చదువులు చదివించాలని సర్వస్వం ఒడ్డడం మనుష్యజాతి భవిష్యత్తు ఆలోచించేనా - అని ప్రశ్నించవచ్చు. ఏమీకాదు. అతనికి ఆ సంగతే తెలియదు - అంటే అబద్ధంకాదు. మనం అజ్ఞాతంగానే, మన స్వార్థ దృష్టితోనే అనేకపనులు, కాదు అన్నిపనులూ చేస్తున్నాం. అయితే ఆస్వార్థాన్ని ఆ ప్రత్యేకమార్గంలోనే నడుపుతున్నదేమిటి? సామాజికావసరం. ఆ అవసరాన్ని మనం అజ్ఞాతంగానే పాటిస్తున్నాం. కాదంటారా?

ఈనాడు మన ప్రభుత్వనాయకులు సంస్కృతంమీద విపరీతమైన ప్రేమ వలకబోస్తున్నారు. రేడియో దెలివిజన్లను కూడా అందుకు పూనుస్తున్నారు.

సంస్కృతం మనదేశంలో ఒకనాడు బాగా ప్రాముఖ్యం పొందినభాష. ఇక్ష్వాకు రాజులకాలంలో తెలునాట అది రాజభాషగా వుండింది. తెలుగునాట సంస్కృత ఉచ్చారణా, పలుకుబడీ స్వచ్ఛంగా, శాస్త్రీయంగా వుంటుందని పీష్వాలకాలంలో తెలుగువానికి పూనా దర్బారుల్లో అపార గౌరవం వుండింది.

అంటే సంప్రదాయం రీత్యా చూసినా, ఈనాటి ప్రభుత్వ ఆదరణ దృష్ట్యా చూసినా సంస్కృతాధ్యయనానికి మన తెలుగునాట అపారాదరణవుండాలి. అక్టోబరు అభ్యుదయ వ్యాసరచయిత దృష్టిలో మధ్యతరగతుల ఆర్థిక పరిస్థితికి ఆ చదువు ఎత్తుకోలేని బరువుకావొచ్చునేమో కూడా. ( ఆవిషయంలోనూ నాకు నమ్మకంలేదు. ) కాని మనం సంస్కృతం కేసి దృష్టిప్పుడంలేరు. అత్యంతవ్యయప్రయాసలతో కూడిన సాంకేతిక విద్యలకేస దృష్టివుంచుతున్నాం. మధ్య తరగతులందరికీ, దేశం అంతటా, ఏక కాలంలో ఈ అవలక్షణం ఎందుకు అంటింది? ఏమీలేదు. అది సామాజికావసరం. అయితే ఆ అవసరాన్ని మనం అవసరంగా గుర్తించం. వుద్యోగం - అందులోనూమంచిది జీతం - అందులోనూ మంచిది, ఆనంద సుఖమయజీవితం - అందులోనూ వీలయినంత భోగాలతో కూడినది. తెచ్చుకోవాలనే లక్ష్యం రూపంలో మనకా సామాజిక అవసరం కనబడుతుంది.

మనం సోషలిజం కోరుతున్నది పోల్ - పాట్ కంబోడియాలో ఏర్పరచదలచినట్లు అదిను మానవదశనాటి కమ్యూనిజం నెలకొల్పడానికికాదు. ప్రజలందరికీ చదువుకొనేఅవకాశం, సంపాదించుకొని సుఖపడే అవకాశంకలిగించాలనే లక్ష్యం కోసం కాని సోషలిజం వచ్చేకనే ఆ చదువూ; ఆ సంపాదనా ఆ సుఖమయ జీవితం చటుక్కున ప్రారంభంకావు. ఆ ప్రయత్నం అంతకు పూర్వపు ( నేటి ) సమాజంలోనే ప్రారంభమవుతుంది. అయింది. కాని, ఈనాటి సమాజంలో అవి అందరికీ లభ్యంకావు. దాని నిర్మాణ స్వభావం అది. కాని ఆ ప్రయత్నంలోనే ఆ నిర్మాణం విధ్వంసం అవుతుంది. చదువుకున్న వారి సంఖ్య పెరుగుతుంది. వారిని ఇముడ్చుకోగలశక్తి వ్యవస్థకులేదు. ఫలితం నిరుద్యోగం. తిండి లేమి, ఇంక వ్యవస్థ మార్పునకై ఆలోచన రాకతప్పదు. వచ్చింది. ఆ ఆలోచన ఫలితాలే నేటి సామాజిక సంఘర్షణలు, తిరుగుబాట్లు విప్లవాలూను.

ఈ మాదిరిగా ప్రతి మానవుడు సుఖ సమృద్ధులకై చేసే అనంత కృషిలో ఒక ముఖ్యమైన భాగాన్ని అక్టోబరు అభ్యుదయ వ్యాసరచయిత ఒక అవలక్షణంగా పేర్కొనడం చాల అనాలోచితం.

అయితే ఈ విద్యాధిక్యత కష్టం సంపాదించడానికి సాధనంగా వుపయోగిస్తున్నారనో, తమకన్న తక్కువ డిగ్రీల వాళ్ళని అవమానించడానికి సాధనం అవు

( మిగతా 49 పేజిలో )

# అభ్యుదయ కవిత — ఆరంభవికాసాలు

**— సోమసుందర్**

అభ్యుదయ సాహిత్యమనేది కేవలం కమ్యూనిస్టు ఉద్యమ ప్రేరణఅని, వైదేశిక అంశమని అభ్యుదయ సాహిత్యానికి వ్యతిరేకులు చిరకాలంగా విందారోపణ చేస్తున్నారు ఇది నిరాధారమూ, అవాస్తవికమైనదికూడా కొందరు ప్రశ్నిస్తుంటారు, అభ్యుదయం మన ప్రాచీన సాహిత్యంలో లేదా అని? పోతనామాత్యుడు సామాజికమైన చైతన్యంతో గాక వైయక్తిక కారణాలను పురస్కరించుకుని మాత్రమే ఆ నాటి వ్యవస్థను విమర్శించాడు. ప్రబంధయుగంలో కూడా ధూర్జటి తదితరులు ప్రభుత్వాన్ని దూషించినా కూడా సామాజిక స్పృహ లేనందున అవి అభ్యుదయపరమైనవి కావు. వేమన ఆనాటి సమాజంలో కల్మషాన్ని పూర్తిగా శుద్ధిచేయాలన్న స్పృహతో రచన సాగించారు. ఆయన అప్పటికి ఆధునికుడు.

అభ్యుదయ కవితాయుగం 1940లో ప్రారంభమైనది. దీనికి మాతృత్వస్థానం వహించిన భావ కవిత్వం పూర్తిగా వైయక్తిక అంశాలతో కూడుకున్నట్టిది.

బహురూపమైన ఈ వ్యవస్థలో బ్రిటిష్‌వారు తమ స్వార్థం కొరకై చిన్న యాంత్రిక విప్లవం కలిగించిన ప్రభావం మూలంగానే బ్రహ్మ సమాజం అవిర్భవించినది. బ్రహ్మసమాజం సామాజిక పరిస్థితుల పరిపక్వత, చైతన్యప్రభావం వలన మాత్రమే ఏర్పడినట్టిది. కేవలం కొందరు వ్యక్తుల కారణంగా గాదు.

గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కాన్ని 'శూద్రకుడిమృచ్ఛకటిక'తో పోల్చటం అన్యాయం. 'కన్యాశుల్కం' ఆనాటికి సంపూర్ణ అభ్యుదయ భావాభివ్యక్తికరణ చేసిన రచన. గురజాడ 'తోకచుక్క' మూఢాచారాలనుచీల్చుకుని వచ్చిన కవిత. ఇది ఆనాటికీ ఈనాటికీ అభ్యుదయ కవిత. ఖండ కావ్యానికి లఘుస్వరూపమిచ్చినవారు గురజాడ మార్గ కవితాస్థాయికి జానపద కవితను ఉన్నతీకరించారు గురజాడ ఇందుకు ఉదాహరణ పుత్తడిబొమ్మ పూర్ణమ్మ: జానపద కవిత్వాన్ని రస మార్గంలో నడిపినవారు నండూరి సుబ్బారావు, బసవరాజు అప్పారావు. వీళ్ళంతా కవిత్వాన్ని అందంగా సృజించారు. భావ కవులు ఆనాటికి దేశ భక్తియుతమైన రచనలు చేశారు. కానీ వీరందరు భారత దేశానికి స్త్రీరూపమిచ్చి దేవతగా ఆరాధించారు. కానీ గురజాడ 'దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్' అని దేశభక్తిని సాహిత్యంలో రూప కల్పనచేసి ప్రజలలో స్పృహకల్పించారు. గురజాడ జ్ఞానాంశానికి ప్రతీక. తొట్ట

తొలి అభ్యుదయకవి. గురజాడ ఆనాడు తన సమకాలీనులైన నట్టి విశ్వనాథ ఇత్యాదులపై తీవ్రప్రభావాన్ని కలిగించారు. గురజాడ బీజప్రాయంగా చూపిన మార్గానికి తర్వాత మార్గదర్శకులైన (1920) ఓంతా దీక్షితులు, బసవరాజు అప్పారావు, చలం - వ్యావహారిక భాషను వ్యక్తస్థాయికి తీసుకు వెళ్ళారు.

ఈ శతాబ్దపు తొలిదశలో వెంకట పార్వతీశ్వరకవులు, అబ్బూరి, రాయప్రోలు భావ పునరుజ్జీవనా చిహ్నాలుగా కవిత్వాన్ని రచించి చారిత్రకప్రాధాన్యత పొందారు.

శిష్ట్లా రచించిన 'నవమి చిలుక' 'మహాలయ అమావాస్య' లలో అంశాలు కొత్తవి కాకపోయినా వానిలోని విధానం సరి కొత్తది.

అభ్యుదయ కవులు ఇతివృత్తాన్ని ఆత్మపరమైనదిగా కుండా ప్రయోజనకరమైనట్టిదిగా స్వీకరించారు. అభ్యుదయ సాహిత్యానికి వర్తమానాన్ని ప్రతిబింబించటం ఎంత ప్రధానమో. ఆగామికి ఆహ్వానం పలకటం కూడా అంతముఖ్యం కవిత్వంలో ఆధునికత కాలవాచికాదు. గుణాత్మకమైనట్టిది. ఆధునిక యోచనకు మార్గదర్శకులైన వారు చార్లెస్‌డార్విన్ కార్ల్‌మార్క్స్, సిగ్మండ్ ఫ్రాయిడ్, ఐన్‌స్టీన్.

శ్రీశ్రీ కవిత్వంలో శ్రీనాధుడు కనిపిస్తాడు. శ్రీనాదునివలె శ్రీశ్రీ కూడ పదగుంభనా విన్యాసంతో, భాషా పటిమతో పాఠకులను ప్రథమాకర్షితులను చేసుకుంటాడు. శ్రీరంగం నారాయణబాబు, శ్రీశ్రీ ఉభయులూ నన్నయ్య నారాయణభట్టుల వ్యటివారు.

శ్రీశ్రీ యుగం 1940లో అంతరించింది. తరువాత కొత్తయుగం ప్రారంభమైనది. శ్రీశ్రీ 'మరోప్రపంచం'తో మేల్కొన్న ప్రజానీకానికి వారికష్టాలను గానంచేసిన, శ్రీశ్రీ తరువాత వారైన నయాగరా కవులు ఆరుద్ర అస్మదాదులు సాహితీ యుగస్రష్టలైనారు.

కుందుర్తి వ్రాసిన 'తెలంగాణా' కావ్యం తెలంగాణా పోరాటానికి పోస్ట్ మార్టమ్ లాంటిరచన. కుందుర్తి వచన కవితా పితామహుడుకాదు. 1937 లోనే సంపత్ 'నాగి' అనే సంపూర్ణ వచన కావ్యాన్ని రచించాడు.

కవిత్వం ప్రతిపాదించే మౌలికమైన విలువలకు దిగంబర కవిత్వం తీవ్ర విఘాతం కల్పించింది. సామాన్య మానవుని హృదయాన్ని పరిశీలించినా, దిగంబర కవిత బాధ్యతా రహితంగా కొనసాగింది. 1940 లో వచ్చిన అభ్యుదయ కవిత్వానికి, 1950లో ప్రారంభమైన డిటెక్టివ్ సాహిత్యానికి వికృతంగా పుట్టినరోగగ్రస్త శిశువు దిగంబరకవిత. దిగంబర కవితోద్యమమే విరసానికి మాతృస్థానమైనది. నైరాశ్యం విప్లవ కవితకు ప్రేరణ కా గూడదు.

నైరాశ్యంవలన విప్లవాలురావు. కాని శ్రీశ్రీ 'జట్కావాలా' గీతం ఇచ్చిన ఉత్తేజాన్ని మానిఫెస్టోగా విరసం మలుచుకోవటం దుఃఖభాజనమైన విషయం.

ఈ నాడు జర్నలిజమే కవిత్వమని

(మిగతా 49వ పేజీలో)

# గ్రామీణ జీవితాన్ని చిత్రించడంలో సిద్ధహస్తుడు ఎర్విన్ స్ట్రిట్ మాటర్

"సంచారి"

రెండవ ప్రపంచ యుద్ధం తరువాత జర్మన్‌గడ్డపైవచ్చిన మౌలిక మార్పులలో ముఖ్యభాగంగా సోషలిస్టు జర్మన్ డెమాక్రటిక్ రిపబ్లిక్ ఏర్పడడం తరతరాలుగా సైనిక తత్వాన్ని పెంచి పోషించిన ఫ్యూడల్ వ్యవస్థకు స్వస్తి చెప్పడం ఐరోపాఖండ చరిత్రలోనే ఒక ప్రధానమైన మలుపుగా చరిత్రకారులు భావిస్తున్నారు. 1945 మేలో ప్రారంభమయిన పరిణామాలు ఏ విధంగా గ్రామీణ జీవిత స్వభావ స్వరూపాలను సమూలంగా మార్చివేశాయో చిత్రించిన జర్మన్ రచయితలలో అగ్రగణ్యుడు ఎర్విన్ స్ట్రిట్ మాటర్.

1912లో రొట్టెలుతయారుచేసే కుటుంబంలో జన్మించిన ఎర్విన్‌బాల్యంలోను, యౌవనంలోను అష్టకష్టాలు పడ్డాడు రొట్టెలు చేశాడు, హోటల్‌లో సర్వర్‌గా పనిచేశాడు, డ్రైవరుగా, జూలో అటెండరుగా రకరకాల పనులద్వారా పొట్ట పోసుకోవడానికి ప్రయత్నం చేశారు. విద్యాభ్యాసానికి అవకాశాలు ఆ రోజులలో అతనికి చాల తక్కువ. అయినా ఆ విషయమై స్వయంకృషినిమానలేదు సోషలిస్టు యువజనోద్యమంతో సంబంధంఏర్పరచుకున్నారు. నాజీ వ్యతిరేకియైనయితనివి దాదాపు 30 ఏండ్ల వయసులో రెండవ ప్రపంచ యుద్ధానికి నాటి పాలకులు పంపారు. 1945 లో పోరుయుద్ధరంగంలో, అవకాశం కల్పించుకొని, శత్రువులకు స్వయంగా లొంగిపోయారు.

యుద్ధానంతరం రొట్టెలు తయారు చేసేవాడిగా పని ఆరంభించారు. ఆ కాలంలోనే ఓపత్రికకు " పజాకరెస్పాండెంటుగా (అంటేపర్మెనెంటుగా గాక, అప్పుడప్పుడూ వార్తలు పంపేటట్లు) నియమించ బడ్డాడు.

ఆ విధంగా 1946లో తన 34వ ఏట మొదలయ్యింది. రచనా వ్యాసంగం క్రమంగా అభివృద్ధిచెంది చివరకు తాలూకా పత్రిక సంపాదకుడుగా నియమితుడయ్యాడు. సమకాలిక జీవితాన్ని గురించి వివిధ రీతులలో వ్రాయవలసిన పరిస్థితులుఏర్పడ్డాయి, ఫీచర్సు వ్యాసాలు, కామెంటరీలు' నాటక సమీక్షలు, చిన్న కథలుకూడా వ్రాయవలసి వచ్చింది.

4 ఏండ్లలో 1950 నాటికి, మొదటి నవల ఎద్దుల్ని తోలేవారు) ధారావాహికంగా జిల్లా సోషలిస్టు యూనిటీ పార్టీ

దినపత్రిలో ప్రచురితమయ్యింది. 1919నుంచి 1933 వరకు, అంటే వైమార్ రిపబ్లిక్ దినాలలో ఫాసిస్టు ప్రభుత్వం వచ్చేవరకు, జర్మనీలో గ్రామ పరిస్థితులను చిత్రించే యీ నవల చదువరులను, విమర్శకులను ఆర్షించింది. 'సరుకున్న రచయితగా' గుర్తింపు వచ్చింది

నాటినుంచి నేటివరకు, అంటే 8దశాబ్దాల కాలంలో కథలు, వ్యాసాలు పద్యాలు, నాటకాలు, నవలలు, వివిధ రీతులలో రచనలు సాగించారు. "సాహిత్యంలో జాతీయబహుమానాన్ని" కొన్ని సార్లు అందుకున్నారు. విశ్వ విఖ్యాతుడైన బెర్టోల్ట్ బెఫ్టాతో సహకరించి ఆయన ప్రోత్సాహం, ప్రోద్బలంవలన "కాట్జ్‌గ్రాబెన్" అనే నాటకాన్ని పూర్తి చేసి, బెర్లినర్ ఎన్ సెంబుల్ ద్వారా ప్రదర్శింపచేసి ప్రస్తుతించ బడ్డాడు.

సున్నితమైనహాస్యం, అందరికీ అర్థమయ్యే శైలి, తక్కువ మాటల లోనే విషయాన్ని కరతలామలకం చేయడం. యీయన ప్రత్యేకత.

రచయితం కార్యకలాపాలలోను కళ, వాస్తవిత, వీటి పరస్పర సంబంధాలు, సాహిత్య స్పృహ, గురించి జరిగే చర్చలలో చురుకుగా పాల్గొనే వ్యక్తి యీయన.

జి. డి. ఆర్ లోని సెవెన్‌సీస్‌సంస్థ ద్వారా, ఓలెబీన్‌కాప్" అనే నవల 1966లో ఆంగ్లానువాదంగావచ్చింది. కొన్ని భారతీయ భాషలలోనికి అనువదింపబడిందికూడా, (తెలుగులో మాత్రంగాదు) 1963లో జర్మన్‌లో మొదటిసారిగా వెలువడిన యీ నవల 1950 - 60లమధ్య గ్రామసీమలలో సోషలిస్ట్ పరివర్తనకై జరిగిన సంఘర్షణను చిత్రించింది.

స్ట్రిట్‌మాటర్‌ను జర్మన్ షోలఖోవ్ అని అనవచ్చునేమో.

---

## తెలివి గలకాకులు

మూలం : ఎర్విన్ స్ట్రిట్‌మాటర్

అడవి మీదుగా గ్రద్దఎగుర్తూ, తిన డానికి ఏమైనా దొరుకుతుందా అని పరిశీలించింది. ఓ జతకాకులు ఆ అడవిలో ఓ చెట్టుపైన గూడు కట్టుకున్నాయి.

దానిని చూచి పెద్ద గలబా చేసాయి. గ్రద్ద మరో చెట్టుపైన తిష్ఠవేసింది,దగ్గర గూడులో నున్న 4 జతల కాకులు సాయపడాలని వచ్చాయి. ఆ కాకులన్నీ గ్రద్ద ఉన్న చెట్టును చుట్టుముట్టి పెద్దగా అరిచాయి. ఆ అరుపులువిని మరింకా కొన్ని కాకులు ఆ చోట చేరాయి. వాటి సంఖ్య 29 కాగానే కొన్ని ఆ గ్రద్ద వెంటబడి పొడవాలని ప్రయత్నించాయి. ఆ గ్రద్ద పారిపోయింది. దానివెంటబడ్డాయి కాకులు చివరకు వాటి సంఖ్య 8 డజన్లుకు పెరిగినది మొత్తంమీద ఆ గ్రద్దను అడవి నుంచి బయటకు తరిమాయి.

20 నిమిషాలు గడిపాయి. మొదటి రెండుకాకులు మళ్ళీ తమగూటికి చేరాయి. వాటిని తెలివిగలవని అందామా?,మిగతా పక్షి వచ్చేసే లోపల మరో గ్రద్ద వస్తే గూట్లోని పిల్లల గతి ఏమయ్యేది?

# అలజడి అదను

అతను
పొలిమేరల్లో పోరాటానికి సిద్ధం
అతను
శాంతి కాముకుడు
పోరాటం లేదు
సమరంలో అతనికి ఉబలాటం లేదు
అతనిది సమరా యత్తత
అదే శాంతికి సుస్థిర వేదిక
శాంతి కపోతాలు స్వేచ్ఛగా ఎగరాలని
తుపాకులు ఎక్కుపెడతాడు అతను
శివుణ్ణి కాల్చి అతనిలో ప్రేమరగిల్చిన
'అతనే' అతను
దేశంలో ఎక్కడ అలజడి జరిగినా
అతను వస్తాడు తప్పని సరిగా
అలజడి ఎవరి మేలుకోసం?
ఆ అలజడి శాంతి కోసం కాకుడదూ

చామర్తి దుర్గాప్రసాద్

---

(44వ పేజీ తరువాయి)

తున్నదనో, ఉద్యోగాల్లో పైకి పాకి పోవడానికి మెట్లుచేసుకుంటున్నారనో ఆరోపణ లున్నాయి. అందులో అతిశయోక్తి ఏమీలేదు. అయితే ఈ దురాచారాలు పెరగ డానికిగాని, పుట్టడానికిగాని విద్యాభ్యాసం కారణం అనడంకన్న అవే విద్యాసాధన తాపత్రయానికి ప్రోత్సాహ కారణాలవుతున్నాయనడం న్యాయం.

మిగిలిన అంశాలలో కూడ చాల భాగం ఇదే మాదిరి అనాలోచితమైన ప్రిజుడిసెస్ వలన వచ్చినవే. దీనిమీద చర్చకు దిగడం మంచిది. అభ్యుదయ సంపాదకులు ఆ చర్చలు వాహ్యానించాలని కోరుతున్నాను.

---

( 46వ పేజీతరువాయి )

భ్రమించే యువరచయితలు వుండటం శోచనీయం చైతన్యపూరితమైన ఈనాటి యువకవులు ఈస్థాయిని అధిగమించాలి. అలాకాకపోతే అభ్యుదయకవితోద్యమం తీవ్రమైన నష్టానికి గురవుతుంది.

ఈ నాటి అభ్యుదయకవులు ప్రాచీన వైదేశిక సాహిత్యాలను సాంప్రదాయ రీతులను, ఆధునికధోరణులను క్షుణ్ణంగా అధ్యయనంచేసి అభ్యుదయ కవితా మార్గాన్ని ముందుకు నడపాలి, కవిత్వాన్ని అందంగా, హృదయానికి హత్తుకునేటట్లు వ్రాయాలి. చెప్పాలి. సామ్యవాదవ్యవస్థ దీనిని తిరస్కరించదు.

# పుస్తక సమీక్షకులొస్తున్నారు జాగర్త!

— జరీ

తెలుగులో పుస్తకాలు చాలా వస్తున్నాయి ఏ పుస్తకాల దుకాణానికెళ్ళినా ఆ నెలలో వచ్చిన కొత్త పుస్తకాల లిస్టు చాంతాడంత చెప్తాడు. దీనికి మనం సంతోషించాల్సిందే. రచయితలు పెరుగుతున్నారు. రచనలు ఎక్కువవుతున్నాయి. అడపాదడపా కొత్త ప్రక్రియలూ వస్తున్నాయి. అయితే ఈ వచ్చే సరుకులో మంచీ చెడూ చూడాల్సిన అవసరం పాఠకులకుంది, వీరిసంఖ్య చాలా పెరిగింది. జనంలో చదివే లక్షణం పెరగటం నాగరకతాలక్షణాలలో ఒకటి. వీటన్నిటికీ ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ వార, మాస. సాంవత్సరిక పత్రికలూ – అక్కడక్కడా అప్పుడప్పుడూ దిన పత్రికలూ తోడ్పడుతున్నాయి. గ్రంథాలయ ఉద్యమం ధర్మాన తెలుగునాట గ్రామాల నుండీ పట్టణాలనుండీ బస్తీలలో సహా వెలసిన గ్రంథాలయాలుకూడా పుస్తక ప్రచురణకు ప్రోత్సాహం కల్పిస్తున్నాయనవచ్చు. వ్యాపారరీత్యా ఏర్పడ్డ ప్రచురణాలయాలు – రచయితలే పెట్టుకున్న ప్రచురణ సంస్థలూ యీ ప్రచురణలను వెలువరుస్తున్నాయి.

ఈ రకంగా వస్తున్న పుస్తకాలను పాఠకుల దగ్గరికి తీసి కెళ్ళడంలో ప్రకటనలూ – సమీక్షలూ ఉపయోగపడ్తాయి. ప్రకటనలను ప్రచురణాలయాలూ, డబ్బున్న రచయితలే చేపట్టగలరు. ఇక సామాన్యులకు మిగిలింది సమీక్షలు.

ఇతర దేశాలలో పుస్తక సమీక్షలకోసం కొన్ని పత్రికలే ఉంటాయి. మన దేశంలో – ప్రధానంగా తెలుగులో అలాటివి దాదాపు లేవనే అనాలి. ఒకటి రెండు ప్రయత్నించి మూతపడ్తాయి. కనుక ఇతర పత్రికలు అవి అందించే అనేక విషయాలతో, శీర్షికలతోపాటు ఈ పుస్తకాలను సమీక్షించటంకూడా చేపట్టాయి.

పుస్తకాలపై విమర్శ – సమీక్ష – పరిచయం – స్వీకారం అనే భేదాలతో నేడు పత్రికల్లో మనంచూస్తుంటాం. ఒక పుస్తకాన్ని ఆసాంతం చదివి దీన్లోని సమస్తాన్నీ వివరిస్తూ సవివరంగా పెద్దవ్యాసరూపంలో వ్యాఖ్యానం అనిపించేలా రాస్తే దాన్ని "ఆ పుస్తకంపై విమర్శ – పరామర్శ" – అంటున్నారు. అలాకాక పుస్తకంలో విషయాన్ని క్లుప్తంగా చెప్పి, పూర్వాపరాలు మరింత సంక్షిప్తంగా తడివి

ఏవో కొన్ని దూషణ భూషణలమచేర్చి రాస్తే దాన్ని సమీక్ష అంటున్నారు. పరిచయం అంటే పుస్తకంలోని విషయాన్ని మరింత కొద్దిగా చెప్తూ ప్రచురణ విషయం చెప్తూ ముగించటం. ఇక స్వీకారం – వచ్చిన పుస్తకాల, ప్రచురణ కర్తల లిస్టు ప్రచురించి చేతులు కడుక్కోవటం.

తమకొచ్చిన అన్ని పుస్తకాలను సమీక్ష చేయించే బాధ్యత సాధారణంగా ఏ పత్రికా నెత్తినవేసుకోలేదు. సాహిత్యపత్రికలు మనకు చాలా తక్కువున్నాయి. ఉన్నవి అన్నిరకాల పుస్తకాలను సమీక్షించలేవు. తమకంటూ కొన్ని సాహిత్యాభిప్రాయాలున్న పత్రికలు కొన్ని ఉన్నాయి. వాటిలో కొన్ని తమ భావాలకు వ్యతిరేక భావాలున్న వాటిని వదిలివేస్తాయి. ఇలా తీసేసుకుంటూ పోతే వస్తున్న పుస్తకాలకు సరైన న్యాయం చేకూర్చగల పత్రికలు తక్కువ – రచయితలకు జరుగుతున్న అన్యాయం ఎక్కువవని తెలుస్తుంది.

ఈ పరిస్థితుల మధ్య పుస్తకాల సమీక్షకులనే ఒక వర్గం ఏర్పడింది. సామాన్యంగా వీరంతా ఏదో ఒక సాహిత్య ప్రక్రియలో అనుభవం ఉన్నవాళ్ళే. నిర్దిష్టమైన సాహిత్యాభిప్రాయమున్న వాళ్ళు ఇందులో చాల తక్కువ. ఈ వర్గం – రచయితలకన్నా ఓ మెట్టు పైనున్నట్టు భావిస్తుంటారు. రచనల్లో గుణాల నన్నిట్నీ బేరీజు వేయగల సామర్థ్యం తమకే ఉన్నదని తలుస్తారు. సాహిత్యంలో గుణ దోష ప్రకరణాల పీనల్ కోడ్ తమకే కంఠతా వచ్చని భావిస్తారు. సమీక్షలలో రూలింగు లిస్తూంటారు.

ఈ అవగాహనతో అభ్యుదయ రచయితల సంఘం హైదరాబాద్ శాఖ గత నెలలో నార్ల చిరంజీవి గ్రంథాలయంలో ఒక చర్చాగోష్ఠి నిర్వహించింది. దాశరధి రంగాచార్య నిర్వాహకులుగా నడిపించారు. ఎల్లోరా ఆరంభిస్తూ; సమీక్షకులు తామే సర్వజ్ఞులమనుకుంటున్నారనీ – తమకు తెలియని విషయాలను సమీక్షిస్తూ ఏవో కొన్ని పదాలూ – అర్థాలూ పట్టుకొని వివరిస్తూ రచనల కన్యాయం చేస్తున్నారని స్వానుభవాలు కొన్ని ఉదహరిస్తూ మాట్లాడారు కొంపెల్ల విశ్వంగారు కొందరు సమీక్షకులు దీన్ని వ్యాపారసరళిగా మారుస్తున్నారనీ – రచనను సమీక్షించి రచయిత దగ్గరకెళ్ళి తమ రచనలచ్చేస్తూ ప్రతిఫలాలిప్పించమని అడుగుతున్నారనీ వీళ్ళ చేతుల్లో సమీక్షలు రాగద్వేషాలకు గురౌతున్నాయని తన కొచ్చిన కొన్ని అనుభవాలు చెప్పారు.

తర్వాత సమీక్షలు సమీక్షకులవ్యక్తిగత రాగద్వేషాల కతీతంగా చేయటానికి వీలుందా ! లేదా? అన్న చర్చ వచ్చింది. దీన్ని వివరిస్తూ అలా అవకాశం ఉందనీ రచనలోని లోపాలను వివరిస్తూ గుణాలను ప్రశంస చేయవచ్చనీ వై. విజయకుమార్, పి. మాధవరావు తదితరులు మాట్లాడారు. డా. ఎన్. గోపి ఆబ్జక్టివ్‌గా – రచనను చూసి సమీక్షచేయాలనీ అలా చేయటం మనందరం మొద

లెట్టాలని అన్నారు. ఈ రకమైన సమీక్ష చేయటానికి అవకాశాలు తక్కువని దాశరధి రంగాచార్య అభిప్రాయపడ్డారు. సర్వశ్రీ చొక్కాపు వెంకటరమణ, బుర్రా సుబ్రమణ్యం, డా॥బూదరాజు రాధాకృష్ణ, రాంభట్ల,తదితరులు చర్చల్లో పాల్గొన్న తర్వాత గోపాల్ గారిఅభిప్రాయంతో ఏకీభవించారు. రచయితలే సమీక్షకులను ఎన్ను కుంటున్నారన్న ఉదాహరణలుకూడా చర్చలసందర్భంగా వెల్లడయ్యాయి రచనలో భావజాలానికి వ్యతిరేకులైన వారికి ఆరచన లివ్వకూడదంటూ అభ్యుదయ ఈ సం ప్రదాయం చేపట్టాలని నందివి సిధారెడ్డి అన్నారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి అనేక మంది యువ రచయితలూ, నగరంలోని పలువురు, వివిధ పత్రికల్లో పనిచేసే రచయితలూ, సాహిత్యాభిమా నులూ, హాజరైన ఈ చర్చా గోష్టి సుమారు మూడు గంటలు నడిచింది. సమావే శం స్థూలంగా ఈ క్రిందివిధంగా భావించింది.

--సమీక్ష రాగ ద్వేషాల కతీతంగా ఉండేలా సమీక్షకులు జాగ్రత్త పడాలి.
-రచయితలకు సూచనలను వారి అభివృద్ధికి ఉపయోగపడేలా చెయ్యాలి.
-ప్రక్రియల ననుసరించి ఆయా రంగాల్లోని వ్యక్తులే సమీక్ష చేస్తూండాలి.
-ప్రచురణాలయాలు రచనలనెన్ను కోటంలో-సమీక్షకుల నెన్నుకోటంలో జాగ్రత్త పడాలి.

-గుత్తపత్రి కాధిపతుల గుప్పిళ్ళలోని పత్రికలు తమ సమీక్షకులను ఎన్ను కోడంలో వ్యాపార సరళి వదిలి పెట్టాలి.

-సమీక్షకులు, ఉచితంగా తమ ఇళ్ళల్లో గ్రంధాలయం సమకూడాలన్న భావంతో కాక రచయితకూ- రచనకూ -తాను చేస్తున్న శ్రమకూ న్యాయం చేకూ ర్చాలన్న భావంతో సమీక్షలు చేస్తూండాలి.

రచయిత లందరూ ఏదో ఒకనాడు సమీక్షకులయ్యే ప్రమాదం ఉంది కనుక మనందరం సమీక్షను ఒక ప్రక్రియగా పరిపుష్టం చేద్దామనీ ఆ దిశగా ఆలో చించటానికి ఈ గోష్టి కొంత ఉపయోగ పడగలదనీ భావిస్తూన్నా నంటూ దాశరధి రంగాచార్య ముగించారు సర్వశ్రీ భాను, జింబో, యస్వీ, రంగాచార్యులు కవితలను చదివి వినిపించారు, ఏటుకూరి ప్రసాద్ వందన సమర్పణతో ప్రతి నెలా రెండో ఆదివారంనాడు గ్రంధాలయంలో జరిగే సాహిత్య కార్య క్రమం ముగిసింది.

---

# సోషలిస్టు వాస్తవికతా – సృజనాత్మక కృషి స్వేచ్ఛ

**– గాబ్రియల్ పెత్రోస్యన్**

సోషలిస్టు వాస్తవికత, సృజనాత్మక కృషి స్వేచ్ఛ -- యివి రెండూ బొత్తిగా పొత్తు పొసగని భావనలనుకొనేవారు యీనాటికి వున్నారు. వీటి గురించి తీవ్ర వాదోపవాదాలు, ఊహాగానాలు కూడా యీనాటికి సాగుతున్న మాటనిజమే. ఇటీవలి వరకు యీ సమస్యల పట్ల ఆసక్తి కొందరు ప్రవీణులకు మాత్రమే పరిమితమై వుండేది. ఇప్పుడలాగాక శుద్ధ సాహిత్య పరిశోధన, కళలు, సాహిత్య విమర్శ, తత్వశాస్త్రం వంటి వాటితో ఏ మాత్రం ప్రమేయం పెట్టుకోని సామాన్యులు కూడా పై సమస్యల పట్ల శ్రద్ధ వహిస్తున్నారు.

సోషలిస్టు వాస్తవికత అంటే ఏమిటి? ఇది సోషలిస్టు కళా, సాహిత్యాల మౌలిక పద్ధతి. సోవియట్ రచయితలపైనా, కళాకారులపైనా దీని నెవరూ రుద్దలేదు. ఇది 1917 అక్టోబరు విప్లవానికి ముందే ఉద్భవించింది. ప్రపంచం నలుమూలలా ఎందరో సమర్థకులను సంపాదించింది.

సోషలిస్టు వాస్తవికత అన్నది, సోషలిస్టు ఆశయాల తొణికిసలాడే వాస్తవికత. అది విప్లవ పరిణామశీలమైన జీవితాన్ని చిత్రిస్తుంది. మాగ్జిం గోర్కీ, వ్లదీమిర్ మయకోవ్‌స్కీ, పాల్ ఎలార్డ్, బెర్టోల్ బ్రెహ్ట్, మిఖైల్‌షొలఖోవ్, జోర్జ్ అమదా, ఆండర్సన్‌నెక్సో, పాబ్లోనెరుడా మొదలైనవారు, సోషలిస్టు వాస్తవికతకు ప్రతినిధులు.

మిఖైల్ షొలఖోవ్ "డాన్ నది ప్రశాంత ప్రవాహం" అన్న గొప్ప నవలను "పార్టీ ఆదేశంమేరకు "రచించారనటం వట్టి మతిమాలిన మాట. గొప్ప కళాఖండాలేవీ "ఆదేశాల మేరకు "సృష్టికావు. ప్రొకొఫీయేవ్, షొస్తకోవిచ్, ఖచతుర్యాన్ సంగీత కళాఖండాలు వారి హృదయ ప్రేరణ ఫలితమే కానీ ఎవరి ఆదేశ పర్యవసానమూ కావు. మిగతా సోవియట్ కళాకారులకు, రచయితలకు కూడా యిదే వర్తిస్తుంది. వారు సోషలిస్టు వాస్తవికతను స్వేచ్ఛగా, ఆత్మసాక్షిగా స్వీకరించారు.

గతాన్ని నెమరు వేసుకుందాం. హీన్రిచ్ హైన్, అల్ఫ్రెడ్ డిముస్సెత్ కాల్పనికులు; వారు, పై వారెవరి ఆదేశాల మేరకో రాశారని ఎవరూ అనలేరు కదా? కాల్పనికతను, కేవలం ఆత్మానుభూతులపై ఆధారపడటాన్ని గాక సోషలిస్టు వాస్తవికతను స్వీకరించిన సోవియట్

*

రచయితలపై యీ ఆరోపణ చేయటం హాస్యాస్పదం కదా?

సోషలిష్టు వాస్తవికత సోవియట్ కళా సాహిత్యాల మౌలిక పద్ధతి అని నేను మరోసారి నొక్కి చెప్పదలచాను. సహజత్వం ఆధునికత వంటి వాటిని మా దేశంలో ఎవరూ అణచివేయలేదు. అవంత్ గార్డె పక్కీ చిత్ర ప్రదర్శనలు అనేకం సోవియట్ యూనియన్‌లో జరుగుతూ వుండటమే యిందుకు ప్రత్యక్ష నిదర్శనం.

తన శైలిని ఎంచుకొనే స్వేచ్ఛ ప్రతి రచయితకు, కళాకారునికి వుండాలి. అలాంటప్పుడు సోషలిస్టు వాస్తవికతను ఎంచుకొనే వారికి ఆ స్వేచ్ఛను ఎలా నిరాకరించగలరు?

సృజన కృషిస్వేచ్ఛ అంటే ఏమిటి? ఈ సమస్య పట్ల సోవియట్ దృక్పథానికి ఆధారం లెనిన్ బోధ. ఎవరైనా సరే సమాజంలో జీవిస్తూ దాన్ని పట్టించుకోకుండా వుండజాలరు అని ఆయన చెప్పారు.

నిర్నిరోధ స్వేచ్ఛను గుడ్డిగా ఆరాధించే వారు అసలు ఆస్వేచ్ఛ ఏమిటి? అది ఎవరికోసం అనే సంగతి స్పష్టంగా గ్రహించాలి.

ఆత్మాశ్రయతా, స్వేచ్ఛ ఒకటికావు. ఒక విధంగా కేవలం వూహా, సత్యమూ ఒకటి కావు. అదే విధంగా అసంఖ్యాకులకు సృజనశీల కృషి స్వేచ్ఛ వుండటానికీ, పై శ్రేణికి చెందిన కొద్దిమందికి మాత్రమే అది వుండటానికీ మధ్య తేడా నుకూడా గ్రహించాలి. అసంఖ్యాక ప్రజానీకానికి స్వేచ్ఛ వుండాలన్నది మా నిశ్చితాభిప్రాయం.

సృజనశీల కృషికి పాదార్థిక హామీల గురించి ఎవరూ పెద్దగా వివాదానికి దిగటం లేదు. మాదేశంలోని సృజనశీల కార్యకర్తలకు పాశ్చాత్య దేశాల్లోని వారికన్న హెచ్చు అవకాశాలున్నవనే యథార్థాన్ని మా వ్యతిరేకులు కూడా అంగీకరిస్తున్నారు వారు భుక్తికోసం కట కట పడిపోనవసరం లేదు. వారు తమ ప్రతిభా సామర్థ్యాలను ధారాళంగా వ్యక్తీకరిస్తున్నారు.

సోషలిస్టువాస్తవికతకు దాని నియమాలు లేవా? అంటే తప్పకుండా వున్నాయి. కళాకారులు, సాహితీపరులు వాటిని స్వచ్ఛందంగా స్వీకరించి శిరసా వహిస్తున్నారు.

కళకూ జీవితానికి కొన్ని నియమాలు వుండితీరాలి. యివి లేకుంటా కళా, జీవితమూ మన జాలవు అవి నిజమైన ప్రతిభ వ్యక్తీకరణకు ప్రతిబంధకాలు కావు బైరన్, షెల్లీలు కాల్పనికతా నియమాలను, స్టెండాల్, టాల్‌స్టాయ్‌లు వాస్తవికతా నియమాలను తు. చ. శిరసావహించారు. అద్భుతమైన కళా ఖండాలను సృష్టించారు.

సోషలిస్టు వాస్తవికతను సోవియట్ యూనియన్‌లోనూ, అనేక యితర దేశాల్లోనూ వేలాది మందికళాకారులు స్వీకరించారు. వారికి స్వేచ్ఛ వుంది దాన్నెవరూ హరించలేరు.

# మన నవల - పరిశీలన

సమీక్ష

— మహారాజు

[మననవల - పరిశీలన; వ్యాససంకలనం; ప్రచురణ చైతన్యసాహితి, వరంగల్; వెల : పన్నెండు రూపాయలు; ప్రతులకు: ఆంధ్ర సారస్వతపరిషత్తు బొగ్గులకుంట, తిలక్‌రోడ్డు, హైదరాబాద్ లేక టి. బాలరాజు, జిల్లా ట్రెజరీ కార్యాలయం, సుబేదారి, వరంగల్ - 506010 ]

అకాడమీలు కళ్ళు, చెవులూ మూసుకనికూర్చున్న తరుణంలో మామూలు సాహితీ సంస్థలు పుస్తక ప్రచురణకు పూనుకోవడం సాహసమే. ఎన్నో కష్టనష్టాలకు ఓర్చి మంచి పుస్తకాల్ని వెలుగులోకి తేవాల్సిన బాధ్యతను మీదేసుకునే సంస్థలు కూడా చాలా తక్కువ. అలాంటి సంస్థల ఉత్సాహం ఎంతో విలువైంది కాని చాలా మంది రచయిత(త్రు)లు ఈ విషయానికి అంతగా ప్రాధాన్యత యిస్తున్నట్లు లేదు. రాయమన్నారు గనక రాసిద్దాం. రాసిచ్చాం గనక ప్రచురిస్తారు. అనే ధోరణిలో వున్నట్లు కనిపిస్తోంది, చైతన్యసాహితి(వరంగల్) వార్షికోత్సవాల సందర్భంగా జరిగిన గోష్ఠి కార్యక్రమాల ఫలితమే ఈ వ్యాస సంకలనం "మన నవల పరిశీలన". ఇది సమగ్రమైన పరిశీలన అని ప్రచురణ కర్తలే చెప్పుకోలేక పోతున్నారు.

ఈసంకలనానికి వ్యాసకర్తల్ని ఎంచుకునే ముందు చైతన్య సాహితి నిర్వాహకులు మరో మారు ఆలోచించుకుని వుంటే బావుండేది, ఈ పుస్తకంలోని మొట్ట మొదటి వ్యాసంలో (ఆరంభ వికాసాలు-డా॥బి. రుక్మిణి) మొదటి వాక్యం ఇలావుంది. "సంస్కృతి అంటే మానవుని ప్రగతి" (?)-ఈరకంగా మొదటి వాక్యంలోనే రచయిత్రి అపారమైన అజ్ఞానాన్ని ప్రదర్శించి పాఠకుడి నోటికి మాట రాకుండా చేస్తుంది. సంస్కృతికి ప్రగతికీ భేదం తెలీని వాళ్ళకూడా యూనివర్సిటీలు తెలుగులో డాక్టరేట్లిచ్చి అధ్యాపకులుగా నియమించుకుంటున్నాయి గనక, ముందు తరాల విద్యార్థుల భవిష్యత్తు పట్ల మనం సానుభూతిచూపాల్సి వుంటుంది. ఎంతో బాధ్యతతో కార్యక్రమాన్ని నిర్వహించాల్సిన సాహితీ సంస్థ నిర్వాహకులు, నవల గురించి కనీస పరిజ్ఞానం లేని వాళ్ళను ఈ విధంగా ఏరి ఏరి వాళ్ళతో వ్యాసాలు రాయించి నలుగురిలో పరువు తీయడం ఏమంత మంచి పని? రెండో వ్యాసంలో (స్వరూప పరిణామం- డా॥ సంపత్కుమార) శ్రీ రంగరాజ చరిత్ర 1872 రాజశేఖర చరిత్ర 1878, మాలపల్లి 1922 ఏకవీర 1930, వేయి పడగలు

1934, అసమర్థుని జీవయాత్ర 1945. చివరకు మిగిలేది 1946. చలం, అడవి బాపిరాజు నవలలపై రచయిత తమ స్వంత అభిప్రాయాలు తెలియజేసుకున్నారు. అంతే కాని ఇతి వృత్తంలో భాషలో శిల్పంలో క్రమక్రమంగా పరిణామాలెలా వచ్చాయో చర్చించలేదు. ఉదాహరణకు, ఏకవీర గొప్ప నవలే కావచ్చు. కాని అది మాలపల్లి తర్వాత వచ్చింది. మనం పరిణామం గూర్చి మాట్లాడుతున్నప్పుడు ఏకవీరను మాలపల్లితో పోల్చి సామాజికతలో, ఆలోచనా విధానంతో, భాషలో, ఇతివృత్తంలో విశ్వనాథ ఎంత వెనుకకు పరిగెత్తాడో రాయాల్సిన అవసరం వుండింది. అలాగే మాలపల్లిలో లేని గొప్ప లక్షణాలు ఏకవీరలో ఏవైనా వుంటే సహేతుకంగా విశ్లేషించి తెలియజెప్పాల్సిన బాధ్యత కూడా వ్యాసకర్తకు వుండింది. ఈ రకంగా ఒక నవల అంతకు ముందు వచ్చిన నవలలతో ఏ విధంగా భిన్నమైందో తెలియజేయక పోతే స్వరూప పరిణామాన్ని గూర్చి చర్చించినట్టులా అవుతుంది? ఇక పోతే, చివరకు మిగిలేది తర్వాత అంటే 1946 నుండి 1979 వరకు నవలలింకా వస్తూనేవున్న విషయం వ్యాసకర్తకు తెలీదని అనుకోవాలా? లేకపోతే 1946 తర్వాత ఏ నవలా కారుణ్ణి కూడా ఈ వ్యాసకర్త గుర్తించ దలచుకో లేదా?

ఎంతో కొంత కుటుంబ జీవిత చిత్రణ అన్ని నవలల్లోనూ వుంటుంది -అని రచయిత్రి (డా॥సి.ఆనందరామం) 'కుటుంబజీవనం'లో ఒప్పుకున్నారు. అంతే కానిమన సాంఘిక జీవిత విధానం ఎలా వుండింది? అందులో ఏరకమైన మార్పులొచ్చాయి? సమకాలికంగా వెలువడిన నవలల్లో అవి ఎంతవరకు చిత్రీకరించబడ్డాయి అనే విషయాలు ఏ మాత్రం రాయలేకపోయారు. ఆవిడ చదివిన నవలలను సమీక్షించారు తప్పితే, నవలల్లో కుటుంబ జీవనాన్ని గూర్చి రాసినట్టులేదు. నిజాయితీతో, శ్రమించి, చదివి ఎంతో విషయ పరిజ్ఞానంతో రాయాల్సివుండగా ఈ వ్యాసాన్ని కూడా నవలలాగా రాసెయ్యడం విచారకరం. వీరు డాక్టరేట్ దొరికిన తరువాతైనా Bibliography సరిగా రాయడం నేర్చుకుంటే బావుండేది.

'శైలి : కథా సంవిధానం'లో రచయిత (మంజుశ్రీ) శైలి గురించి తక్కువగా ఇతరముల గూర్చి ఎక్కువగా రాసారు. (ఇటీవల ఓ మహామంత్రి విశ్వవిద్యాలయ వజ్రోత్సవాల సందర్భంగా సావనీర్లో వ్యాసంరాస్తూ విశ్వవిద్యాలయాన్ని వదిలేసి తన ఆత్మకథను చెప్పుకున్నారు. తానే ఒక విశ్వవిద్యాలయమంటే ఎవరే మనగలరు గనక?) రంగరాజ చరిత్ర మొదలు ఇప్పటి వరకు వచ్చిన కొన్ని నవలలు గూర్చి సంవత్సరాలతో సహా తెలియజేశారు చాలా చోట్ల చలం పట్ల విముఖతను, విశ్వనాథ పట్ల గౌరవాన్ని నిర్భయంగా వెల్లడించుకున్నారు. ఇట్లా స్వంత అభిప్రాయాలు కాకుండా స్టైలిస్టిక్స్ చదివి దాన్ని మనతెలుగు సాహిత్యానికి అన్వయించి చెప్పడంకావాలి.

నవలా పరిణామం, తొలిదశ మలిదశ, మూడోదశ, ఇటీవలిదశ మొదలైన నాలుగు దశలలో జరిగిందని, క్రమక్రమంగా నీతి ప్రాధాన్యం - జాతీయోద్యమం - మనోవిశ్లేషణ - హేతువాద దృక్పదం - ఈ రకంగా వస్తువులో కూడా పరిణామం జరుగుతూ వచ్చిందని సిద్ధాంతీకరించి చెప్పడం బావుంది. (అతీత - వర్తమాన, భవిష్యత్తు - డా॥ సుప్రసన్న) కాని సృజనాత్మక రచనల్లాగే విమర్శకులు కూడా సామాన్య పాఠకులు ఉత్సాహంతో చదవగలిగేట్లుగా రాస్తే బావుండును. (పండితుల భాష ఎలా ఉంటుందంటే ఒక్కోసారి తెలుగులోంచి తెలుగులోకి అనువదించుకోవాల్సిన అవసరం వుటుంది. 'జాతీయోద్యమం' వ్యాసాన్ని బి యస్. మూర్తి, త్రివ్వేది లింగరాజు తెలుగులోంచి తెలుగులోకి అనువదించారనుకోవాలా?) జాతీయోద్యంలా గురించి చాలా వివరాలిచ్చారు. రచయిత (పేర్వారం జగన్నాధం).

సుధర్శనంగారి నవలలో తక్కిన తెలుగు మహా గ్రంధాల వలె కాక పాత్రలు మొదటి నుంచి చివరివరకు ఒక గొప్ప ఆధ్యాత్మిక పరిణామాన్ని పొందుతాయట. (తాత్త్వికత - ముదిగొండ వీరభద్రయ్య). ఈ రచయిత లోగడ అభ్యుదయలో సంసార వృక్షాన్ని వ్రేళ్ళతో సహా పెళ్ళగించిన వల్లంపాటి వెంకట సుబ్బయ్యగారిని చదివినట్లు లేదు. 'సామాజిక చైతన్యం గురించి రాస్తూ, తెలుగు నవలా రచయితలలో వేళ్ళమీద లెక్కించతగిన కొద్దిమందిలో తప్ప ఈ సామాజిక చైతన్యం సర్వసాధారణంగా మృగ్యం అంటారు రచయిత. (మహీధర రామమోహనరావు). సర్వసాధారణంగా మన రచయితలందరికీ సామాజికస్పృహ వుందనడానికి సందేహించనక్కరలేదు అంటారు మరోచోట. కాని నిజానికి సామాజికస్పృహ అంటే ఏమిటో కూడా తెలియని చాలామంది రచయిత్రులు, రచయితలు వున్నారని, పేర్లు రాసుకుంటూపోతే పెద్దపట్టిక తయారుకాగలదని చెప్పడానికి సందేహించనక్కరలేదు. ఇప్పుడు విరివిగా వస్తున్నది నవలా సాహిత్యమే. అందులో మంచి నవలలు చాలా తక్కువగా వస్తున్నందుకు వ్యాసకర్తలెవరూ ఆవేదన వ్యక్తం చేయలేదు.

పుస్తకం చివరలో ఆరు పేజీల తప్పొప్పుల పట్టిక చేర్చడం క్షమించరానిది. ప్రచురణకు ముందు వ్యాసాలు ఒకటికి రెండుసార్లుచదివి పునరుక్తి దోషం లేకుండా ఎడిట్ చేసుకోవాల్సింది. ఉదాహరణకు మార్చి 1833 సం॥లో చింతామణి పత్రిక ప్రదర్శించిన ముఖ్య నిబంధనల గూర్చి, వీరేశలింగం, విశ్వనాధలగూర్చి సంపత్కుమార, మంజుశ్రీ, పేర్వారం మొదలైన వాళ్ళంతా విడివిడిగా వారి వ్యాసాలలో రాస్తూపోయారు. ఇలా అందరూ ఒకే విషయం గూర్చి రాయడం - పాఠకుడి సహనాన్ని పరీక్షించడం. పోనీ

( మిగతా ప్రక్క పేజీలో )

# మాట్లాడే మల్లెలు

— ఎస్జీ ఓ

[ ఆచార్య తిరుమల. ప్రతులకు: నవయుగబుక్‌హౌస్ సుల్తాన్ బజార్, హైదరాబాద్ ]

ఈ పుస్తకం పేరు చూడగానే శ్రీ దాశరధి రాసిన 'అచుంబితం' అన్న గేయంలోని 'మాట్లాడని మల్లెమొగ్గమాదిరిగా నడిచిరా' అనే లైన్లు గుర్తుకొస్తాయి. కాని ఇవి 'మాట్లాడే మల్లెలు.' మల్లెలను పీడితప్రజలకూ మరోచోట తన అక్షరాలకూ ప్రతీకలుగా ఎన్నుకున్నారు కవి. అయితే అట్టడుగు మల్లెలేకాక మధ్య తరగతి మల్లెలుకూడ ఇందులో ఉన్నాయి.

ఇందులో 32 కవితలున్నాయి. వీటిలో ముప్పాతికవంతు సామాజికదృష్టితో రాసినవి. మిగిలినవి (సృష్టి దృష్టి, భయపడికాదు నేను బ్రతికేది, శూన్యబిందువు కన్నీటి కైవళ్యం, అనంత నిరీక్షణ, స్వప్నవాసంతిక మొ।। ) తాత్త్వికస్పృహతో అన్వేషించినవి.

తిరుమల కవిత్వంలో పీడితజనులపట్ల మొగ్గూ (నీ కోసం), ఇన్స్పిరేషన్‌కు ఆటంకాలూ (ఉద్దీపన), కాకిగూళ్లోచిక్కుకున్న కోయిల ఆ మనికోసం పడే తహతహ (పల్లవి), చీకటిలాంటి ప్రశ్నలకు కిరణాల్లాంటి జవాబు ( చీకటి కిరణాలు ) 'నేను' 'మనం' గా రూపొందే పరిణామం (ఏకోహం బహుస్యాం), అధిభౌతికమైన అనుభూతికోసం జరిపే అన్వేషణ (సృష్టి దృష్టి) మొదలైనవన్నీ ఉన్నాయి.

మల్లెలేకాదు కవిత్వంకూడా మాట్లాడాలంటూ శ్రీ ఎల్లోరా పీఠికలో ఈ విధంగా అన్నారు.

"కవి, ప్రధానంగా ఆధునికకవి నా ఉద్దేశంలో అభ్యుదయ కవి అయినా, విప్లవకవి అయినా – మరేకవిఅయినా – ప్రగతి భావంతో కవితలు రాస్తూ సమా

---

( 57వ పేజీ తరువాయి )
వేర్వేరు కోణాల్లోంచి పరిశీలించి రాస్తే అదివేరే విధంగా ఉండేది. ఇందులో ఒకటి రెండు తప్ప, మిగాతావన్నీ అతి సాధారణ సమీక్షావ్యాసాలు. అవికూడా తెలుగు సాహిత్యం చదువుకునే విద్యార్థులకు కొద్దో గొప్పో ఉపయోగపడ యేమో గాని, మామూలు పాఠకులకు కాదు. విమర్శలు మామూలు జనం ఎందుకు చదువుతారూ? అని – ప్రశ్నిస్తే వాళ్ళతో చదివింపజేసేట్లుగా రాయగలగాలని సమాధానం!

జాన్ని మేలుకొలుపుతూనే నిత్యజీవితంలో ప్రకృతి ధర్మమైన ఆనందానికి కోమల పద ప్రసూనమాలికలు అల్లడం, శృంగార భావచిత్రాలను తేనెసోనలు చిందేలా హృదయవీణ మీటి పలికించడం నేరంకాదు"

శ్రీ ఎల్లోరా మాటలకు లక్ష్యప్రాయంగానే ఉంది తిరుమల కవిత్వం.

ఇప్పుడు వెలువడుతున్న చాలా కవితల్లోని భావక్లిష్టత, నిర్మాణక్లిష్టత లేక పోవటం తిరుమల కవితల్లోని మొట్టమొదటి సుగుణం. చెప్పదలచింది స్వచ్ఛంగా స్ఫటికంగా మెరిపిస్తారు.

"నలిగిపోయిన పూలనే ఏరుకుంటాను
పగిలిపోయిన గుండెనే కోరుకుంటాను
ఆవేదనా అశ్రుకణాల మీదుగా
అంతరంగానికి పయనించి
అస్పష్ట జీవిత చిత్రాల్ని చేరుకుంటాను-"

" దేశమంటే మనుషులోయ్ " అనేది ఈ సంపుటిలో మాస్టర్ పోయం. గురజాడ 'దేశభక్తి' గీతంతో ప్రబోధించిన దానికి పూర్తిగా వ్యతిరిక్తమైన వర్త మానస్థితి గతుల చిత్రణ, సెటైర్ ఇందులో ఉంది,

"పసిబిడ్డల పాలడబ్బాలు సైతందాచేసి
సంఘాన్ని నిలువునా దోచేసే
బందిపోటు వ్యాపారుల
ఇళ్ళల్లో - ఇనుపపెట్టెల్లో కట్టుబడి
పెట్టుబడికేగాని గిట్టుబడిలేని
నోట్లకట్టల జోలపాటలతో
మగత నిద్రపోతున్న భాగ్యేందిరను చూడు"

... ... ...

"ఒకని శ్రమ శాఖకి పదిమంది
తలక్రిందుగా వేలాడుతున్న
ప్రకృతి దృశ్యాన్ని చూడు.

అలాగే 'వేపతోరణం' మరో మంచి వ్యంగ్యరచన 'ఆనంద',పోయి "రాక్షస" ఉగాది రావటం దీన్లోవస్తువు.

మల్లెకి బదులు పిల్లి
ఒళ్లు విరుచుకుంది
దానిమ్మ ముఖం బద్దలయ్యింది
కొబ్బరికాయ గుండె చెరువయ్యింది"
మరోచోట మధ్యతరగతి నిస్సహాయ మల్లెలను
దయనీయంగా వర్ణించటం కన్పిస్తుంది,

"ఉద్యోగాలకు–ఉద్యోగరక్షణకు
అధికార్ల వలపుటాకుల మీద
అరమోడ్పు కళ్ళతో
అసహ్యాన్ని చూస్తున్న మల్లెలు
అసహనాన్ని నేస్తున్న మల్లెలు"
సహనం ఒకనాటికి బద్ధలౌతుందనే ధ్వని ఉంది.

తమకున్న దనుకునే 'నిబద్ధత, ఎడిటివాడిలో లేదని పెదవి విరచే 'సహృదయులు' కూడా కాదనలేని కవిత్వముందీ మల్లెల్లో కుర్రకవుల ప్రాచీన గ్రంధాలు చదవనక్కరలేదని సలహాలు ఇస్తున్న నేటి కాలంలో తిరుమల మంచి వ్యుత్పన్నత ఉన్న కవి. స ప్రదాయకమైన ప్రతీకలను ఆధునికరీతులకు వాడుకోవటం అతనిలో సర్వత్రా కనిపిస్తుంది. "ప్రాంతీయాభిమానదుర్యోధనులు" "నాయకసుగ్రీవులు"వంటి ప్రయోగాలు విశిష్టమైనవి,

ఈ పుస్తకంలోని కొన్ని భావ చిత్రాలు కవి ప్రతిభకు గీటురాళ్ళు
"కదళీకోసం చాచిన చేతుల్లాంటి
నదీనదాలు"
"ఎండిన చెట్టు మీద నో
రెండిన కాకుల్లాంటి
పేద చూపుల బంజరు భూములు"

"కార్బను కాపీ బానిసత్వం, షుగర్ కోటింగ్ పిల్ ప్రగతి, రెట్టమతం రచయిత"వంటి ప్రయోగాలు ఆహ్లాదకరంగా ఉన్నాయి.

కాని కొన్నిచోట్ల కామాల (" ")మధ్య ఇచ్చిన పదగత చమత్కారాలు అక్కడక్కడ అనుభూతికి భంజకంగా ఉన్నాయి. 'పౌడి' చేయడం,'కొమ్మ''తో–రణాలు,' 'సమావేశం, సను–ఆవేశం,' 'శుక'దృష్టి,'చెప్పు,, 'వర్గ,' 'మార్గశిర, వంటివి లైటర్‌వేన్‌గేయాల్లో వ్యంగంగా ఉన్నా, అనుపుగావి చోట అడ్డుపడుతున్నాయి.

వచన కవిత్వంలో తనదైన సరికొత్తగొంతు తిరుమలది విశిష్టమైన భావాలు, అంతులేని అర్థశ్రిత తిరుమల సొత్తు మానవత్వానికి ఆహ్వానం పలుకుతూ, మానవత లేని ప్రగతి ప్రగతి కాదంటూ "మూఢవిశ్వాసాన్ని మనప్రచండ వీక్షణాకిరణంతో కాల్చాలనీ" నిరాశావట వృక్షాల్ని మన వజ్రసంకల్పంతో" నరకాలనీ తపించే తిరుమల కవిత్వంలో శ్రీసుధామ గుర్తించినట్లు మరోసుగుణం సంయమనం.

---

# 'కాలవాహిని'

**తాతిరాజు**

[కాలవాహిని - కవిత - బెజవాడ గోపాలరెడ్డి - ఆంధ్రసారస్వతపరిషత్తు ప్రచురణ వెల - 6-00 రు]

తానే స్వయంగా ప్రకటించినట్టుగానే గోపాలరెడ్డిగారు 'కవిసమ్మేళనం'లోకి ఆలస్యంగా ప్రవేశించినా "సాహిత్య తూణీరంలో ఒకే కవితాబాణాన్ని వేసుకొని ఇతర సాహిత్యమృగయా వినోదులతోపాటు వేటకువెడలి-సునాయాసంగా దొరికిన కాలువ అనే జింకను భుజాల మీద వేసుకొని ఇంటికి రాగల" వారు. ఒకే కవితా బాణం వున్నదనడంలో వినమ్రతా 'కాలువ' అనే జింకను సునాయాసంగా సాధించగలమ' అనడంలో ఆత్మవిశ్వాసమూ తళుకులీని కవిసమ్మేళనం అనే కవితను ఆస్వాదమధురంగా తయారుచేసాయి.

'కాలవాహిని' పేరిట రెడ్డిగారు వెలువరించిన ఇరవయి కవితల సంపుటిలో రెండో కవిత ఇది కాని ఇందులో సగంకన్నా ఎక్కువ కవితలు బాగులేవని చెప్పక తప్పదు. చిరకాలంగా వారు రాయదలచి చివరికి సాధించిన 'తాజ్ మహల్' అనే కవిత రసదృష్టికి సంతృప్తి కలిగించదు. అలాగే పదేళ్ళుగా వారు రాయాలని అనుకుంటూ వచ్చి రాసిన "మావూరి రావిచెట్టు" కవితలో కూడా సాంద్రతలేదు. 'పత్రిక-రేడియో' అనే కవిత మరీ ప్రాథమిక తరగతుల పాఠంలాగ తయారయింది. ఈ మూడేకాక 'కాలము' 'జనావర్ణము' 'వకుళవితానము' 'జనవరి 26' అనే అయిదు కవితలూ కూడా గంభీరమైన భావాభినివేశాన్ని కలిగించే శక్తిలేక వెల వెల బోతున్నాయి. 'కాలపు ఆత్మకథ' కవితలో మానవ పరిణామ చరిత్రని వచనంలో చెప్పడమే జరిగింది తప్ప కవిత్వంలో కాదు. దివిసీమ అల్లకల్లోలం చేసిన "ఉప్పెన"ను ఇలలో శకుంతలకి జరిగిన అన్యాయానికి తల్లిమేనక కటు వచనాలతో శపించి' 'భూదేవికి నష్టము కావాలని కోరుతూ దేవేంద్రుణ్ణి కొలిచిందా' అన్నట్టు ఊర్వశి ప్రణయావేశయై అన్యమనస్కయై విలయతాండవము చేస్తూ విలోల కల్లోల నృత్యభంగిమ చూపినట్టు" కవిభావించారు. "మే స్మృతులు" అనేది ఆత్మకథాత్మకవచనం. "జనవరి 18" అనే కవితలో 77ఎన్నికలలో పరాజితులైన వియతృత్వ చీకటిశక్తులపట్ల సానుభూతి కనిపిస్తుందే తప్ప అభిశంసన కనిపించదు 'అంబేద్కర్,' 'మూగకోకిల' 'మైలురాయి' 'రేడియో' అనేకవితలు సామాన్యంగా ఉన్నాయి. 'కవిసమ్మేళనం,' 'రావిఆకు' అనేకవితలు భావస్ఫోరకంగా వున్నాయి. కాని ఈ సంపుటికి తలమానికమైన కవితలు "నేడు" - "నిన్నలు" అనేవి. కవిని చిరకాలంగా ముగ్ధుణ్ణి చేసే కాలం ఆయనచేత నాలుగుకవితల్ని రాయించింది.

అందులో సుదీర్ఘమైనకవితలురెండూ ("కాలము," కాలపు ఆత్మకథ") రసహీనంగా వుండగా "నిన్నలు" "నేడు" అనేవి మాత్రం గోపాలరెడ్డిగారిలోని కవిహృదయానికి మణి దర్పణాలుగా నిలవదగ్గవి.

'నిన్నలు' కవితలో విషాదభావం విశ్వరూపం ధరిస్తుంది. కవిగారు సామాన్యుల బాధల గాథలు రికార్డు చేస్తారుకాని మానవాధీనంలో లేని కారణాలవల్ల కలిగే బాధల్ని మాత్రమే పేర్కొంటారు.

"నిన్నలు పురి పెట్టుతూ రేపుల దూదినుండి వడికిన సన్నని దారము నేడు"

"పరిగెడుతూ నిన్నల గుర్రాలు వదలిన నోటి గుర్తులు గిట్టల గుర్తులు మన జ్ఞాపకాలు"

అంటూ నిన్నలగురించి రాసిన వాక్యాలేకాక - నేడు గురించిరాసిన 32 లఘు కవితల వంటి వాటిల్లో -

"మరణి చినభూతకాలపు అంధకారము/ జన్మించని భావికాలపుఅంధకారము మధ్య మెరిసే జ్యోతిరింగణము నేడు"
"పెద్దదైన చీకటి తెరలో / వెలుగును చిదించే / చిన్నబెజ్జమునేడు"
"నిన్నలు రేపులకు అందించే లేఖనేడు"
"చీకటి ఏరులో తేలుచువోతూ చిరునవ్వే బుడగనేడు"

వంటి హృదయంగమమైనవి చాలవున్నాయి రెడ్డిగారిని కవిగా నిలబెట్టేది ఆయన సాధించిన ఈ కవిత్వహ్రస్వలిపే

మినీ కవిత అనేది పత్రికల పరిమితుల ప్రయోజనాల దృష్ట్యా వెలుగులోకి వచ్చినాసరే - అదియువ కవులందరికి చేసినమేలు వొకటుంది. (కొత్తగా కవితా ప్రాంగణంలోకి అడుగు పెట్టిన వృద్ధులకి కూడా ఈ ప్రయోజనం సిద్ధించగలదు.- సాధనవుంటే.) ఆ ప్రయోజనం ఏమిటంటే కవిత్వానికి ప్రాణాంతక దుర్లక్షణమైన అతివ్యాప్తిని పరిహరించడం.

— O —

---

# గమనిక

అక్టోబరు అభ్యుదయలో 'చర్చావేదిక' కింద ప్రచురితమైన వ్యాసం "మధ్యతరగతి నీచత్వం..." తచయిత శ్రీ మంథా వెంకట రమణారావు. పొరపాటు దొర్లినందుకు చింతిస్తున్నాం.

— సం॥

---

# దార్శనికత కొరవడిన మంచి కవిత

— కిషోర్

[ సమాజానందస్వామి - కార్టూన్ కవితలు - దేవిప్రియ ఝరి పొయిట్రీ సర్కిల్ ప్రచురణ – వెల : 8-50 పై ]

" అందంగా సున్నితంగా తిట్టే తిట్టును - వ్యంగ్యం - అంటాం. బండగా మొరటుగా చెప్పిం వ్యంగాన్ని - తిట్టు - అంటా" మంటారు ఆదివ్యంగ్యకవి రాంభట్ల.

ఎమర్జెన్సీ రోజుల్లో, దేశం "కవిపించని కటకటాలమధ్యన పడివున్న" రోజుల్లో "ప్రజాతంత్ర"లో సమాజానందస్వామినోట దేవిప్రియ వినిపించే అందమైన సున్నితమైన తిట్లు వినడానికి తెలుగు పాఠకలోకం ఎదురుచూస్తూండేది. వాటిని పుస్తకంగా కూర్చి విడుదల చేశారు ఝరి పొయెట్రీ సర్కిల్ వారు.

ఆరుద్ర చెప్పినట్లు, ఈ పుస్తకంతో దే వి ప్రి య తనది ఓ "సరికొత్త యాస"గా రుజూ చేసుకున్నారు

"పీకపిసికిన ఖూనీకోరే శవంపైబడియేడ్వడం
అధికధరలను అదేపనిగా గుట్టు వీథికి ఈడ్వడం"

అన్నప్పుడూ, "జెండా పేదదే పాపం క్రమటుకు హై క్లాసు
దొందూ దొందేలెండోయ్ జనతా అండ్ కాంగ్రెసు"

అన్న సందర్భంలోను, "కవిశ్రీలు, నేతశ్రీలు ఇంటికొకరు యిప్పుడు
కాకిపిల్ల కదిలినా, భుజకీర్తుల చప్పుడు"

అన్నప్పుడూ దేవిప్రియసొంతగొంతు శ్రావ్యంగా వినిపిస్తుంది.

"అగ్నిపర్వతం వంటి ఉద్యమంచేసేపని, ఒక మంచి వ్యంగ్య చిత్రం, వ్యంగ్య కవిత చెయ్యగల"వనినగ్నముని నమ్మిక వ్యంగ్యకవితపరిమితిని తెలుసుకోకపోవడం నగ్నమునిలాంటి వాడికి తగదు. ఉద్యమాలు చేసేపని కవితలూ చిత్రాలూ చేయలేవని నగ్నముని యిప్పటికైనా తెలుసుకోవాలి.

పుస్తకం పొడుగునా, దేవీప్రియ మిడిల్ క్లాస్ సంకటాలను గురించి వ్యాఖ్యానిస్తారేగానీ, పునాది వర్గమైన కార్మికవర్గం ప్రస్తావన అరుదు. ఆ ప్రస్తావించిన ఒకటి రెండు సందర్భాలూ అపశృతులే।

బ్యాంక్ ఉద్యోగులు జీతాల పెంపుదలకోసం చేసే సమ్మెను విమర్శిస్తూ

"ఆకాశం మీదవారి వేతనాల ఆట
మట్టే గద యితరేతర ఉద్యోగులనోట"

అంటారు దేవిప్రియ. బ్యాంకు ఉద్యోగుల వేతనాలఆట ఆకాశంమీద అవునోకాదో తర్వాతచర్చిద్దాం. ఇతరేతర ఉద్యోగులనోట మట్టికొడుతున్నది బ్యాంక్ ఎంప్లాయిసా? పైగా వార్ని

" పెరుగుట విరుగుట కొరకే" అని హెచ్చరిస్తున్నాడీయన

"ఉదారంగ దొరతనలు పెంచుతాయి డి.ఏ

సిటీ బస్సు ఛార్జీలకే అంతాసరిపోయే' అన్న దేవి ప్రియేనా పై మాటన్నది కూడా?

అలాగే, అంగోలా జాతీయ విముక్తి సమరాన్ని "ఆటోతులయుద్ధం"గానూ ధీర అంగోలాను"అవుదూడ"గానూ ఈయన ఎందుకు అభివర్ణిస్తున్నాడూ?

అంతర్జాతీయంగా – అంగోలావిముక్తి సమరం సందర్భంగా కూడా-అమెరికన్ సామ్రాజ్యవాదానికి తొత్తురికం చేస్తున్న చైనాను "నేటి ఎర్రమైనా"గా ఎందుకు కీర్తిస్తున్నాడీయన?

"ఛందస్సు మర్మాలు తెల్సి ఉండటం, కవితాత్మని పలకరించడం" అనే అర్హతలున్నా, దేవిప్రియకు "సమాజంలోని మంచిచెడ్డల్ని విడదీసి కామెంట్ చేయగలిగే శక్తి నిచ్చే దార్శనికత లేదు. జీతాలు పెంచమని కోరద్దనడం ఈ దివాలా కోరుతనానికి తిరుగులేని ఉదాహరణ. ఆయనకవిత్వం "ఉష్ట్రపక్షి"కవిత్వంకాకుండా ఉండాలంటే నిర్దిష్టమైన దార్శనికతకోసం దేవి ప్రియ ప్రయత్నించాలి.

---

# రాజమన్నారు సాహిత్య సేవ

**డా॥ నాయని కోటేశ్వరి**

[1955లో విజయవాడలో జరిగిన అభ్యుదయ రచయితలసంఘ 5వమహాసభలో అధ్యక్షులుగా శ్రీశ్రీ ఎన్నుకోబడేటంతవరకూ పి.వి. రాజమన్నారు అధ్యక్షులుగా ఉన్నారు. అనేక సాహిత్య ప్రక్రియల్లో రచనలు సాగించిన వీరు నాటికలు రాయటంలో సిద్ధ హస్తులు. వీరి స్మృతి చిహ్నంగా ఈ వ్యాసాన్ని ప్రకటిస్తున్నాం. (సం]

అభ్యుదయ రచయితల సంఘానికి 5వ మహాసభవరకు అధ్యక్షులుగావున్న శ్రీ పి. వి. రాజమన్నారుగారు 1901 మే 10వ తేదిన రాజమహేంద్రవరంలో జన్మించారు. వీరు జీవితమంతా మద్రాసులోనే గడిపారు. మద్రాసు క్రిస్టియన్‌కాలేజీలో ఇంగ్లీషు, తత్వశాస్త్రాలను అభ్యసించారు. న్యాయ కళాశాలలోచేరి న్యాయ శాస్త్రాన్ని అధ్యయనంచేశారు. పరీక్షలలో ఎప్పుడూ వీరిదే ప్రథమ స్థానం. విశ్వవిద్యాలయంనుంచి బంగారు పతకాలనుకూడా పొందారు. వీరు ఇంగ్లీషు, సంస్కృతము, తమిళము, ఫ్రెంచిభాషలను నేర్చుకున్నారు. తెలుగు మాతృభాష. వీరు ప్లీడరు వృత్తిచేస్తూ 1944లో అడ్వకేటు జనరల్‌గా నియమింపబడ్డారు. మరుసటి యేడే మద్రాసు హైకోర్టు న్యాయమూర్తిగానియమింపబడ్డారు. మరి మూడేండ్లకు మద్రాసు హైకోర్టు ప్రధానన్యాయాధికారిగా నియమింపబడ్డారు. వీరి తండ్రిగారు శ్రీ పి. వి. రమణరావుగారు మైసూరు హైకోర్టు న్యాయాధికారిగావున్నప్పుడే వీరు మద్రాసు న్యాయాధికారిగా వ్యవహరించారు.

1957లో తమిళనాడుకు ఆక్టింగ్ గవర్నరుగా వ్యవహరించారు. 1964 - 65లో నాల్గవ ఫైనాన్సుకమీషన్ అధ్యక్ష పదవి నిర్వహించారు. మద్రాసు విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్రఅధ్యయనమండలికి అనేక సంవత్సరాలు అధ్యక్షులుగా ఉన్నారు. కేంద్ర సంగీతనాటక అకాడమీ అధ్యక్షులుగాకూడా వ్యవహరించారు. ద్రవిడమున్నేత్రకజగం ప్రభుత్వంచేత కేంద్రరాజ్యసంబంధసమితికి అధ్యక్షులుగా నియమింపబడ్డారు. నర్మదానదీ జలాల వివాదంలో మధ్యవర్తిగాకూడా ఉన్నారు.

మద్రాసు విశ్వవిద్యాలయ తెలుగుఅధ్యయన మండలిలో వీరు సభ్యులు. వెంకటేశ్వర విశ్వవిద్యాలయ తెలుగు అధ్యయనమండలికి అధ్యక్షులు. ఆంధ్రవిశ్వవిద్యాలయ నాటకకళ అధ్యయనమండలికి అధ్యక్షులుగా ఉన్నారు. అనేక తెలుగు

సాహిత్య సిద్ధాంతవ్యాసాలకు పరీక్షకులుగా వ్యవహరించారు, మదరాసు, అణ్ణామలై ఆంధ్రవిశ్వవిద్యాలయాలు వీరికి గౌరవ డాక్టరేట్ పట్టాన్నిచ్చాయి.

న్యాయవాదవృత్తిలోనూ, ప్రధానన్యాయమూర్తిగాను ప్రతిభావంతులనిపించు కున్నారు. లలిత కళలన్నవీరికి ప్రత్యేకాభిమానం. విద్యార్థిదశలోనే 'కళ' అనేమాస పత్రికను స్థాపించి కళలలోను, సాహిత్యంలోను, చక్కని అభిరుచులను కలిగించ డానికి ప్రయత్నించారు. సాంఘిక నాటకాలవైపు ప్రజలదృష్టిని ఆకర్షింపజేయడానికి ప్రఖ్యాతనటుడు రాఘవతోపాటు వీరుకూడాకృషిచేశారు. ఈ ప్రయత్నంలో 'తప్పె వరిది?' అనే నాటకాన్ని రచించారు.

దంటు కృష్ణయ్యగారు ప్రత్యేకం స్త్రీలతో 1924లో నవలా నాటక సమాజం స్థాపించారు. ఇంతలో వచ్చిన రాజమన్నారుగారి 'తప్పెవరిది?' అన్ననాట కాన్ని శ్రీ బళ్ళారి రాఘవాచార్యులువారు బెజవాడలో ప్రదర్శించారు. ఇందులోస్త్రీలే స్త్రీ పాత్రలను ధరించారు.

కన్యాశుల్కం నాటకం హిందూసమాజంలో పాతుకొనిపోయిన నైతిక పతనా నికి దారితీసే ఆచారాలమీద వ్యంగ్యమైన హేళనగా రాజమన్నారు రచించిన తప్పెవరిది పురుషజాతి అనుసరించే ద్వంద్వనీతిపట్ల మహామేధావి, న్యాయశాస్త్ర నిపుణుని దయనీయమైన ఆవేదనఅయింది.

గమన వేగంవల్ల సామాజిక సాహిత్యోత్సవాల్లో సద్యోవినోదము సంఘటింప జేసే ఏకాంకిక పెద్దనాటకాలను త్రోసిరాజన్నది. రాజమన్నార్, నార్లవెంకటేశ్వర రావు, ముద్దుకృష్ణ, ఆచార్యఆత్రేయ నవీనాంధనాటకరంగానుకూలంగా, అమూల్య మైన ఏకాంకికలు రచించారు. వారు ప్రయోజనకరమైన, పఠనయోగ్యమైన, ప్రయోగార్హతగల రూపకాలు మనకు ప్రసాదించారు. రాజమన్నారుగారి నాటక రచ నలో ఒక ప్రత్యేకతవుంది.

శ్రీ రాజమన్నారు అరుణోదయ సంగీత నాట్యమండలి 1957 సం. ఏప్రిల్‌లో జరిగిన ద్వాదశ వార్షికోత్సవసందర్భంలో ప్రసంగిస్తూ ఏమని ప్రబోధిం చారో చూడండి — "నాటకకళలోనే దేశ సంస్కృతి ఎక్కువగా విశద మౌతుంది. అందుచేత మనం సంస్కృతికి దూరంకాకూడదు. మన నాటకకళా పరి ణామం అన్యదేశ విజ్ఞాన సంపర్కాన్ని బహిష్కరించనవసరంలేదు. కాని కేవలం మనకు సహజంకాని జీవితాంశాలను యథాతథంగా మననాటకాల్లోకి తెచ్చిపెట్టుకుంటే పులినిచూచి నక్కవాతలు పెట్టుకున్నట్లు హాస్యాస్పదమవుతుంది. ఇది నా మనవితో కూడిన హెచ్చరిక.

లోకవృత్తానుకరణమే నాటికకు ఇతివృత్తమైనప్పటికీ నాటిక మానవజీవితానికి ఛాయాచిత్రంలాంటి అనుకరణకారాదు. ఆశయాలవైరుధ్యంవల్లా, యత్నాలసంఘర్ష

ఇలావల్లా చిత్రవిచిత్రంగా మళ్ళీ జీవితానికి రసమయచిత్రణ నాటిక. రాజమన్నారుగారి నాటకాల సందేశాలకు వైచిత్రీ వైలక్షణ్యమూ ఉన్నవి. "వేశ్యాంకు ప్రేమాభిమానాలుండవని నిరసిస్తాము, వారికావెండూనిష్ఫలాలు. ధనవంతులైతే నే మీ సంకల్పం ఒకటైతే పర్యవసానం మరొకలాగ ఉంటుంది. మాస్కృ! ప్రేమకు లోతెవరు కొలవగలరు. లోకం కత్తులబోను, నిర్దాక్షిణ్యపు నియమాలతో సంఘం దెయ్యాల లంకఅయిపోయింది. ధనవంతునికి ఆధ్యాత్మికరాజ్యందుర్గమం. తథాగతుని దిగ్విజయంలో లోకాన్ని సౌందర్యవంతం చేసే ప్రేమజ్యోతులెన్నో ఆరిపోయాయి. సంస్కారమన్నది ప్రజలనుదాటి పెద్ద అంగలు వెయ్యలేదు. ఆదర్శాలు అనుభవాన్ని దాటిపోతే బాధయే పర్యవసానం, లోకాన్ని ప్రేమ జయించగలకాలం ఇంకా రాలేదు." అన్న సందేశాలు బరువైనవి, సమాజానికి పైపైన తేలే బెండ్లుకావు.

ఈ సందేశాలు అనుభవానికి రావాలంటే నాటికలకథలు రసవంతాలై ప్రేక్షకుల హృదయాన్ని ఆర్ద్రము చెయ్యాలి. కథల గమనం జీవితాన్ని పేనిన జడలాగ సాగిపోవాలి. మనసు మాత్రమేకాదు మానవత్వాన్ని ఉండాలి.

సంఘం దృష్టిలో పతిత అయిన స్త్రీని నాయికగా తీసుకొని శ్రీ పి. వి.రాజమన్నారుగారు 'ఏమి మగవాళ్ళు,' నిష్ఫలం అనే నాటికన్రాశారు ఈ రెండింటిలో నాయికలు వేశ్యలయినా వారు మృచ్ఛకటికంలోని వసంతసేన స్థాయిని అందుకోగలవారు. కాని వీరున్న సంఘము మృచ్ఛకటికమునాటి సంఘముకాదు. వీరి ప్రేమకు పాత్రులైన వ్యక్తులు చారుదత్తునివంటివారు కాకపోవడంచేత వీరిత్యాగమునకు, మంచితనానికి అపహాస్యమే మిగిలింది.

లోలోపలవున్న కోరికల్ని అణచుకొని, సంఘమర్యాదలకోసం నాటకమాడే పెద్దమనుష్యులు రహస్యంగా అవకాశం దొరకగానే ఎటువంటి కక్కుర్తికిపాల్పడతారో 'ఏమి మగవాళ్ళు' అనేనాటిక వెల్లడిచేస్తుంది. 1920లో వ్రాసిన ఈ నాటకం "ఎంథమనుష్యరు" అనేపేరుతో కన్నడంలోకి కూడా అనువదించబడింది. వీరి నాటికలుకొన్ని ఇతర భాషలలోకి కూడా అనువదించబడ్డాయి.

నిష్ఫలంలోని నాయిక చిత్రరేఖ జమిందారు అప్పులు తీర్చడంకోసం తన నగలన్నీ అమ్మివేస్తుంది. చివరకు ఆ జమిందారే ఆమె ప్రేమను గుర్తించక అనుమానంతో ఆమెను విడిచి వెళ్ళిపోతే హతాశయై నిలిచిపోతుంది.

విముక్తి అనే నాటికలో తన స్నేహితురాలికుమార్తె కాలుజారిన బాలవితంతువు ఐన రాధ అధోగతిచూచి తాను ఆమెకు సహాయం చెయ్యాలనుకున్నా సమాజాన్ని భర్తను, ఆడబిడ్డను చూచి భయపడి ఏమీ చెయ్యలేకపోయిన కామేశ్వరమ్మ చివరకు తనకొడుకే ఆమెకు చేయూతనిచ్చి వివాహం చేసుకుంటానన్నప్పుడు సంతోషిస్తుంది ఆమెను రక్షించడానికి ఇంటిని తల్లిదండ్రివి విడిచి వెళ్ళిపోతాడుసత్య

నారాయణ. చివరకు తండ్రిలో పరివర్తనకలిగి వారిని రమ్మన్నప్పుడు ఆ బాల వితంతువు జీవించివుండదు. సత్యనారాయణ తనకోసం పడేబాధ చూడలేక ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకుంటుంది.

"వైకుంఠాచార్యులు" అనే నాటకంలో వైకుంఠంనుంచి తాళపత్రలేఖలు తెప్పించుతున్నానని వెర్రి ప్రజలను దోచుకుంటున్న వైకుంఠాచార్యుల్ని ఇద్దరు యువకులు ఉపాయంగా యిరుకున పెట్టి నొక్కబోతే అతడు ఆ ఉపాయం చేతనే తప్పించుకుని వారిద్దర్నీ గ్రామస్థులచేత త్యమిస్తాడు. అంతేకాక వైకుంఠాచార్యుల్ని వైకుంఠానికి పంపేసి సదాశివబ్రహ్మంగామారి హెడ్ఆఫీసు కైలాసానికి మార్చేస్తాడు. ప్రజలలోవున్న మూఢ విశ్వాసాలను వాటిపరిణామాన్ని చక్కగా వెల్లడించారు. రాజమన్నారుగారు

పాత్రపోషణలో రాజమన్నారుగారి చెయ్యి అందె వేసింది. చెకోవ్ 'కోరస్ గరల్' కంటె నిష్ఫలంలోనిచిత్రరేఖ తెలివైనది. టాగూరు మాషీకంటె మాతృ ప్రేమలోని రామలక్షమ్మగారి బుద్ధి సూక్ష్మమైనదీ, మనస్సు గొప్పదీను. ఏమి మగ వాళ్ళలోని కనకము దెయ్యాల లంకలోనిసుధ ఉజ్వలమైనపాత్రలు నాగుపాము లోని జయశ్రీ, బుచ్చిబాబు తిష్య రక్షితను చంపిపుట్టింది అమె చంచలఅయి ఈమె ఉల్క. తన ప్రేమావేగములో జ్వలించి హరించిపోయింది.

వీరి నాటికలు 'వృథాయాసం,' 'సంకల్పం,' 'కఠినమార్గం,' 'పరకీయ,' 'నందిని,' 'వెధరిముండ,' 'బంధాలు,' 'భార్యాభర్తలు' మొదలైనవి చక్కని ఇతి వృత్తాలవే. వీరి ప్రతినాటికలో ఒకస్త్రీ గోచరమవుతుంది. ఏదో ఒక స్త్రీ సమస్య స్త్రీ పాత్రయొక్క ఉదాత్తత్వము గోచరిస్తాయి. అలాగని గయ్యాళి పాత్రలు లేక పోలేదు. 'వృథాయాసంలో' భర్తను ఏకి పిండిపెట్టాలనే గయ్యాళిభార్యను విడిచి భర్తే చచ్చిపోతాడు. భర్త వెధరిముండ అని పిలిస్తే వ్యక్తిత్వము కోరకుండా సంతో షించే అమాయక స్త్రీ పాత్రలూ వున్నాయి.

రాజమన్నారుగారు ఎన్నో పుస్తకాలకు చక్కని చెప్పుకోదగిన పీఠికలు వ్రాశారు.

రాజమన్నారుగారు "శృతితప్పినజీవనరాగం" అనే నవల కూడా వ్రాశారు. ఇందులో కథానాయిక కల్యాణి- తండ్రివయస్సుగల కృష్ణయ్య ఈమెను ఎంగిలిచేసి చివరకు కల్యాణి బలవంతంవల్ల ఈమెను వివాహం చేసుకుంటాడు. చివరకు ముసలి మొగుడు పడుచు పెళ్ళాం కథే. అనుమానంతో గర్భవతియైన ఆమెను కలకత్తాలో వదలి వచ్చేస్తాడు. సహృదయుడైన శిరీష్ ఒక స్నేహితుడుగా ఆమెకు రక్షణకల్పి స్తాడు. కాని దురదృష్టవశాత్తు విమాన ప్రమాదంలో మరణిస్తాడు. రక్షణలేని ఒక అందమైన స్త్రీ ఏకాకిగా ఎన్నిపాట్లుపడుతుందో అన్నీ పడుతుంది కల్యాణి. చివరకు

కుమార్తెను భర్తకు అప్పగించి అతడు క్షమించమన్నా అతనితో వుండడానికి మనస్సు అంగీకరించక ఆత్మహత్యచేసుకుంటుంది కల్యాణి.

శ్రీ పి.వి రాజమన్నారుగారు "నీడలేనిఆడది" సినిమాకి కథకూడా వ్రాశారు.

బాధ్యతగల పదవుల్ని నిర్వహిస్తూకూడా రచయితగా. సాహితీప్రియుడుగా సమాజం పట్లతన బాధ్యతను విస్మరించని వ్యక్తి. పి. వి రాజమన్నారు. రచయితగా ఊహాలోకాల్లో విహరించక తాను జీవిస్తున్న సమాజంలోని సమస్యల్నే ఇతివృత్తంగా తీసుకొని రచనలుచేశారు. తన జాతి జీవనమే, తన జాతిసంస్కృతే రచనల్లో ప్రతిబింబించాలన్న తన అభిప్రాయానికి అనుగుణంగానే ఆయన రచనలు చేశారు. ఆయన కేవలం రచయిత మాత్రమేకాదు. సాహితీమిత్రుడుకూడా. ఆయన మరణం తెలుగువారి జీవితంలో ఒకలోటును సృష్టించిందని చెప్పకతప్పదు.

---

# నిరీక్షణ

లేదు యిసుమంత శాంతి - ప్రశాంతి
ఏది ఒక్కింత సుఖము - సౌఖ్యము
ఈ జీవిత చరమాంకం వరకూ చేదు వగరులే
ఈ చండ కిరణుని చేత స్వేదమే బ్రతుకంతా
చల్లని నీడన కునుకే గగనమై
గూడే కరువైన గోడు మోడు బ్రతుకునాది
రత్నగర్భ భారతావని తలమున కెవ్వన
అడుగిడిన భారతీయుని బతుకే నాది
ఎండి మాడి బీటలు వారిన
హృదయ క్షేత్రం -
కళ్లల్లోంచి వెనుక్కి వరిగిన
అశ్రుధారలతో తడసింది రవ్వంత హృదయక్షేత్రం
మొలుస్తుందేమో అంకురం - దరహసిస్తుందేమో భవిష్యం.

— శశిశ్రీ

# ఈ దేశంలో ఒక మనిషి కథ

కథానిక

షేక్ నజీర్

రైల్వేప్లాట్ ఫారమ్ జనంతో రద్దీగా ఉంది. జనతా ఎక్స్ప్రెస్ రావడానికి ఇంకా 5 నిమిషములు సమయమున్నట్లు పెద్ద అక్షరాలతో టైమ్‌బోర్డు సూచిస్తుంది. కొంత మంది తమతమ బంధువులకి, మిత్రులకి వీడ్కోలు ఇవ్వడానికి వచ్చిఉంటే, మరికొంతమంది ప్లాట్‌ఫారమ్ మీదున్న కలర్స్ చూడ్డానికి వచ్చారు. 5 నిమిషాలు లేటు అని వ్రాసిఉన్నా, 25 నిమిషాలయినా కూడా రైలు రాలేదు. కాలక్షేపానికి వచ్చినవారికి కొంచెం సరదాగా ఉన్నా ప్రయాణీకులకు మాత్రం కొంచెం ఇబ్బందిగావుంది.

ఇంతలో జనతా ఎక్స్ప్రెస్, ఆఫీసు నుండి ఇంటికి వచ్చిన మధ్య తరగతి ఉద్యోగిలా చిందులు త్రొక్కుతూ ప్లాట్ ఫారమ్ మీదకు రానే వచ్చింది. జనం ఒకరినొకరు తోసుకుంటూ ఎక్కుతున్నారు దిగుతున్నారు. రెండు నిమిషాల తరువాత బడిగంట కొట్టినట్లు శబ్దం వినిపించింది. దాన్ని అనుకరించి గార్డు విజిల్, రైలుకూత విన్పించాయి. రైల మెల్లగా కదలడం మొదలుపెట్టింది.

రైలు జనంతో రద్దీగాఉంది. రైలు కదలుతుండగానే ఒక 40 సంవత్సరాల వ్యక్తి తన భార్యా ఇద్దరు బిడ్డలతో సహా రెండు గోనె సంచులతో ఎక్కాడు. పాపం! రైలలో కూర్చోడానికి చోటు లేనందున, రెండు గోనెసంచులను సీట్ల కింద త్రోసి తను, తన భార్యా పిల్లలు కింద కూర్చోవలసి వచ్చింది. చాల రోజులనుండి అన్నం ముఖమేఎరుగనట్లున్నాడు. చినిగిన బట్టలు అతుకులువేసి కట్టుకున్నాడేగాని తన పేదరికం అనే మురికికి అతుకులు వేయలేకపోయాడు. అసలు అతడు రైలు ఎక్కగానే అందరికీ అసహ్యం కలిగినట్లుగా వారివారి ముఖాలలో కనిపించే మార్పులవల్ల స్పష్టమవుతుంది. భార్యకూడా మసి బట్టలు కట్టుకొని ఉన్నది. ఇకపిల్లల ఒంటి మీద అసలే బట్టలు లేవు. నల్లగా పంది పిల్లల్లాగా సీట్ల క్రింద పడిఉన్న బఠానీ గింజలు, వేరుసెనగకాయలను తినడానికిగాను తల్లివడిలో నుండి జారుతున్నారు తల్లి తన పేదరికపు ఆకలిని దాచాలనుకున్నా, అది పిల్లల ద్వారా ప్రకటితమవుతోంది

రైలు శరవేగంగా వెళ్తుండగానే "టికెట్! టికెట్!" అంటూ కంపార్ట్‌మెంటులో ప్రవేశించాడు టి.సి. చకచకా ప్రయాణికుల నుండి టిక్కెట్లు పుచ్చుకొని, పరిశీలించి సంతకాలు చేస్తూ క్రింద కూర్చున్న 40 సంవత్సరాల వయస్సుగల రామయ్య దగ్గరకు సమీపిం

చారు టి.సి ప్రక్కనున్న గోనె సంచులను కాలితోతట్టి - వీటిలో ఏమున్నాయి? అనిఅడిగాడు టి.సి. "బాబు! మేం ప్రక్క ఊరిలో పనిచేసే కూలివాళ్ళం. పని పూర్తిఅయినందున వేరే ఊరికి పనికోసం వెళ్తున్నాం. ఈ సంచులలో పాతబట్టలు మట్టి పాత్రలు తప్ప ఏమి లేవు" అనిదీనస్వరంతో అన్నాడు రామయ్య.

"సరే! టిక్కెట్లు చూపించు" అన్నాడు టి.సి. తన, తనభార్య టిక్కట్లు చూపించాడు రామయ్య. పైకం లాగాలనుకొన్న టి.సి నిరుత్సాహంగా వాటి మీద సంతకాలు చేసి వేరే కంపార్టు మెంటులోకి వెళ్ళిపోయాడు.

గోనె సంచుల్లో పాత బట్టలు, మట్టి పాత్రలున్నాయని తెలిసిన పిమ్మట సీట్ల మీద కూర్చున్న జనం కాళ్ళను సంచులమీద పెట్టడం మొదలు పెట్టారు. దాంతో సంచుల్లో కొంత కదలిక గమనించిన రామయ్య ముఖం దీనంగా మారిపోయింది. ముఖంలో దుఃఖం, అసహాయత, అసమర్థతస్పష్టంగాకనిపిస్తున్నది. ప్రయాణికులు నిజానికి గోనె సంచుల మీద కాళ్ళుపెట్టినప్పటికి ఆ కాళ్ళు తన మీద పెట్టినట్లుగాబాధ పడ్డాడు రామయ్య కారణం ఆర్థిక ఇబ్బందుల వలన నాలుగు రోజుల నుండి ఆకలిగా ఉన్న తన సలుగురు పిల్లల్ని ఆ గోనెసంచుల్లో కుక్కాడు రామయ్య

పొట్ట నింపు కోవడానికే డబ్బులేనప్పుడు తన బిడ్డలకి టిక్కెట్లు ఎలా కొంటారు రామయ్య? అందుకనే అతడిలో అసహాయత, అసమర్థత చోటు చేసుకొన్నాయి. ఇది ఒక రామయ్య కథే కాదు. లక్షలాది రామయ్యలు మనకి అనుదినం దేశదరిద్రానికి చిహ్నం అన్నట్లు రైళ్ళలో దర్శనమిస్తుంటారు.

---

# నిప్పు ఒళ్ళు విరుచుకుంది

నిప్పు ఒళ్ళు విరుచుకుంది
ఆ విరుపులో ఎన్నెన్ని మెరుపులని ?
క్రోధం - శౌర్యం - ప్రతీకారం
అధికారం - ఆవేశం - అభిమానం.
ఇవన్నీలేకపోతే
నిప్పు నీరు కారిపోదూ??

డా॥ ఆచార్య బావన్

# అపకీర్తి శేషులు

## ఒకే అంకము - ఒకే రంగము

రంగము : రాళ్ల వలస
స్థలము : సెంట్రలు జైదు
రంగస్థలము : బలి వేదిక
సమయము : ముప్పావు రాత్రి
లైటింగు : గుడ్డి వెన్నెల చందము

పాత్రలు : లూసో; విన్నో; (ప్రజలు)
ప్రవేశము :లూసో, విన్నో.

**లూసో:** (తనలో) ఈ జగన్నాటకములో నా పాత్ర పరిసమాప్తి యగుచున్నది. కామన్నది కానూన్ ఉన్నది ఆకమానదు.........(ప్రకాశముగా) "నీచే ఉరి. తీయబడుటకు నేను సిద్ధముగా యున్నాను..........!"

**విన్నో:** (ప్రకాశముగా) "ఉరికంబము గూడ సిద్ధముగనే యున్నది. తల దూర్చుము" (తల దూర్చేక, తనలో) ఈతని పీక నేను తీయనిచో నా పీక ఈతడు అవశ్యము తీయగలడు (అనుకుంటూ లూసో తాడు తెంపును)!

(ప్రజలు): అల్లాహో లూసో?
సెభాషో విన్నో!

మన కత్తికాదు,
మన కోడి కాదు,
పదండి పోదాం!
దొందుకు దొందే!
నేటి విన్నో రేపటి లూసో?

- తెరదించవలెను -

— నిష్ఠల వెంకటరావు

# తెలుగులో సాహిత్య ఉద్యమాలు

అద్దేపల్లి రామమోహనరావు

సాహిత్యం ఉద్యమ రూపంగా వ్యాప్తిపొందడం ఆధునిక కాలంలో జరిగిన ఒక ప్రధాన ధోరణి. ఇరవైయవ శతాబ్దానికి పూర్వంసాహిత్యమంతా ఎంత వైవిధ్యాన్ని ప్రదర్శించినా, ఒక్క మాటలో చెప్పాలంటే, కవితాశిల్పంమీదజరిగిన నిరంతరప్రయోగమే. సాహిత్యపరంగా ఉద్యమ మన్న మాటకి కొన్ని భావాలయొక్క ప్రచారం ప్రధానమైన అర్థం, ఇరవైయవ శతాబ్దినుండి మాత్రమేభావాల ప్రచారం సాహిత్యానికి ఆవశ్యకమైన విషయంగా కనిపించింది. అంతకుముందు సమాజానికీ సాహిత్యానికీ భావాల ప్రచారం అక్కర్లేదు. ఎందుకంటె పుణ్యపాపాలు, ధర్మాధర్మాలు, మంచి చెడ్డలూ అన్నిటికీ నిశ్చలమైన లక్ష్యాలు వారివి. వాటిని ఎంత గొప్పగా కథారూపాన చెప్పగలిగితే అది అంత గొప్ప సాహిత్యం వారి దృష్టిలో. కాని ఇరవై శతాబ్ది ప్రారంభంనుండి సమాజంలో 'మార్పు' ప్రధానసూత్రంగా నిలిచింది. సర్వసమానత లక్ష్యంగా, అన్ని భావరంగాలలోను పరిణామం ప్రారంభమయింది. అందుకే సాహిత్యంగూడా సమాజంలో, జరిగే మార్పులకి అనుగుణంగా భావప్రచారాన్ని లక్ష్యంగా చేసుకుంది. సమాజానికిపనికి వచ్చే వినూతనభావమే, శిల్పశక్తివిమించి ప్రజల్ని ఆకట్టుకోవడం ప్రారంభమయింది. సామాజిక స్పృహతో సంచలించిపోయిన గురజాడ అప్పారావు

'దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్'

అంటే అది ఉత్తమ కవిత్వంగా ప్రజల్ని కదిలించింది. సమాజంతోమార్పుని చూడలేనివారికి అందులో శిల్పంకనిపించలేదు. సమాజంతో స్పందించేవారికి అదేప్రజల్ని ముందుకు నడిపించే కవిత్వమయింది.

భావ ప్రచారానికి ప్రాధాన్యమిచ్చే సాహిత్యస్వరూపానికి గురజాడ తానొక్కడే ప్రతిరూపమై సంప్రదాయంతో సంఘర్షణనికి ఆదికవిగా, కొంతమంది కవులు ఒక బృందంగా ఏర్పడి సమిష్టి శక్తితో భావాల్ని వ్యాప్తి చెయ్యడానికి పూనుకొని సాహిత్యానికి ఉద్యమరూపాన్ని యివ్వడంలో మొట్ట మొదటి ప్రయత్నం భావకవితోద్యమం. ఇది పూర్తిగా పాశ్చాత్యదేశాల్లోని రోమాంటిక్ మూమెంట్ (కాల్పనిక ఉద్యమం)కి ప్రతిబింబంగా కనిపించినా, తెలుగు కవుల అనుభూతి విశిష్టతచేతా, భావవ్యక్తీకరణ వైచిత్రిచేతా, ఆరోజుల్లో సాహిత్యంతో ఆధునికతా

స్ఫూర్తికి తొలిసారిగా విశ్వరూపంలా భాసించి, ఉద్యమమనే దానికి ఒక నిండైన అర్థాన్ని కల్పించింది. అసలు భావ కవిత్వ మంటేనే విశిష్టమైన భావాలకి కవితా రూపాన్ని కలిగించడం. శైలిలో శిల్పంలో ఉన్నబలం కంటే భావంలోని వైచిత్రియే పాఠకుణ్ణి మైమరపింప జెయ్యడం ఈ భావ కవితోద్యమం యొక్క విశిష్టత ప్రణయాన్ని చెప్పినా, ప్రకృతిని వర్ణించినా, దేశభక్తితో జ్వలించినా భక్తితో పరవశించినా కవి తన అంతరాంతరాల్లో చెలరేగే భావాలనే రూపుకట్టడానికి ప్రయత్నించడం భావకవిత్వపు ప్రత్యేకత. దీన్ని ఆత్మాశ్రయమనుకున్నా అంతర్ముఖత్వమనుకున్నా భావ కవిత్వంలో జరిగిన ముఖ్యమైన మార్పు, కవిత్వంలో శిల్పం శిల్పం కోసమేగాక, కొన్ని విశిష్టభావాలకి అంగంగా మాత్రమే నిలవటం

ఆకులో ఆకునై పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై నునులేత రెమ్మనై
ఈ అడవి దాగి పోనా ఎటులైన
యిచటనే ఆగిపోనా

అని కృష్ణశాస్త్రి పాడినప్పుడు, ప్రకృతిలో లీనం కావడమనే వినూత్న భావాన్ని ఉత్తమ కవితా రూపంగా చెప్పడమే పులకరింపజేస్తుంది.

ఎన్నాళ్ళు మన కోలె ఈ సుకములంటి
కంట నీరెట్టింది జంటనాయెంకి

అని నండూరి సుబ్బారావు చెప్పినపుడు, అగాధమైన జీవిత మూలవేదనా భావంలోని కొత్తదనమే ప్రధానవస్తువు భాష, వ్యక్తీకరణా ఆ భావ లోని వైచిత్రికి చేసిన శిల్పాలు. ఇట్లా భావకవిత్వాన్ని మొత్తమ్మీద చూస్తే, భావంలోని విశిష్టత ప్రధానం, భాషా సౌందర్యం, అభివ్యక్తి సామర్థ్యం, దాన్ని ఉజ్వలంచేసే సాధనాలు మాత్రమే అని చెప్పవచ్చు.

అంతర్ముఖమైన భావవైచిత్రిచేత భావకవితోద్యమం గుండెమీద తుఫానై చెలరేగగా, సామాజిక సమస్యలకు దర్పణంగా, సంఘం మీద ఉప్పెనలా విజృంభించింది అభ్యుదయ కవితోద్యమం. సామాజిక భావాలలో సంప్రదాయ విధ్వంసన దీని ప్రధాన లక్ష్యం.

రాజు కట్టినకోట రాణిమెట్టినతోట
భూతాలు గెంతాయిలే
బొమికలే నిండాయిలే
అంటారు పురిపండా అప్పలస్వామి గారు.

వ్యక్తిలో నుండి సమాజం చీల్కొచ్చే సరిహద్దు రేఖమీద సమాజంలోని బాధాజ్వాలలన్నిటికీ మూలదావాగ్ని ఆవిష్కరింప బడ్డచోట అభ్యుదయ కవితోద్య

మవు ఆత్మ అంకురించడం జరిగింది. 1930లలో ఏర్పడ్డ ఆర్థిక సంక్షోభంలో నుండి, పాశ్చాత్యులైన ప్రోగ్రసివ్ పోయట్స్ యొక్క కవితా ప్రభావంలో నుండి అగ్నిశ్వాసగా వికసించిన శ్రీ శ్రీ కవిత్వం అభ్యుదయ కవితోద్యమానికి ద్వారాలు తెరిచింది.

ఏదేశ చరిత్ర చూచినా
ఏ మున్నది గర్వ కారణం
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం
నరజాతి చరిత్ర సమస్తం
దరిద్రులని కాల్చుకుతినడం

అభ్యుదయ కవిత్వానిది ప్రధానంగా వర్గదృష్టి. అడుగున పడ్డవర్గంయొక్క బాధల్ని గాథల్ని వర్ణించి పీడితవర్గాల అభ్యుదయానికి కృషిచెయ్యడం, వారి జీవితాల్లోవించి విప్లవాన్ని వికసింపజెయ్యడం దీనిలక్ష్యం. తనకుముందుతరంలో ఉధృతంగా లేచిన భావకవిత్వం మానవస్వేచ్ఛను గూర్చి ఎంత పరితపించినా సౌందర్యమూ, అనుభూతి ప్రధానమై, సమాజపురోగతికి ఉపకరించలేదు. భావకవులంతా గాలిలో ఎగిరిపోతూ కలలు కన్నారు. కాని మనిషిగాలిలో లేడు. గాలిలోఎగిరిపోతూ కలలు కనలేడు. వాడు గాలిలోకి ఎగిరినా, కలలుకన్నా అన్నీ ఒక వ్యవస్థా నిర్మాణం యొక్క ఫలితం. ఒక వ్యవస్థలో ఒక ఆర్థిక సామాజిక పరిస్థితియొక్క వలయంలో ప్రతివ్యక్తియొక్క స్థితి, నీతి మొదలైనవన్నీ ఆధారపడిఉన్నై, సమాజంలోని వ్యక్తి యొక్క ఆలోచనలు సరియైనవి కాని, సమాజాన్నివదిలిపెట్టి ఆకాశానికిఎగిరిపోయే మనిషి కలలు వ్యర్థమైనవి. – అన్న భావాలు అభ్యుదయోద్యమానికి నేపథ్యంగా నిలుస్తై.

అభ్యుదయ సాహిత్యం అంతకు ముందున్న సాహిత్యదృక్పథాన్ని పూర్తిగా మార్చివేసింది. వస్తుదృష్టి ప్రధానమూ, శిల్పదృష్టి అప్రధానము అయింది. కేవలం భావ వాహికగా కవిత్వం మారిపోయింది. అందువల్లనే ఛందస్సు విషయంలో తీవ్రమైన వైవిధ్యం వచ్చింది. లయబద్ధగేయాలూ, లయలేని గేయాలూ, వచన గేయాలూ మొదలైన అనేక విధాలైన ప్రయోగాలు ఈ అభ్యుదయ యుగంలో జరిగినై, చివరికి అభ్యుదయభావానికి వచనగేయానికీ ఒక సమగ్రరూపం తెచ్చింది అభ్యుదయోద్యమం. సమాజం రక్తమాంసాలుగా, పీడితవర్గం గుండెకాయగా, పోరాటం ప్రాణవాయువుగా ఈ ఉద్యమం 1934 నుండి 1965దాకా సాహిత్యాన్ని సమాజాన్ని ఊపివేసింది. 1965నుండి దాదాపు 1965దాకా సాహిత్యంలో ఉద్యమ తరంగాలులేవు అభ్యుదయ భావరేఖ ప్రాధాన్యంవహించినా, వచనకవితని అనంత ముఖాలుగా అభివృద్ధి చెయ్యడం ఈ కాలంలో జరిగింది. బాలగంగాధరతిలక్

ఆ ధోరణిలో ప్రధాన స్థానం వహిస్తాడు. సామాజిక ప్రయోజనాన్నే ముఖ్యంగా పెట్టుకుని వికసించిన వచన కవిత ఒక ఉద్యమం కాకపోయినా ఉద్యమమంతటి స్ఫూర్తిని యువతరంలో కలుగజేసింది. అందుకే ప్రజాభాషకీ అభ్యుదయ భావనకీ ప్రథమస్థానమిచ్చే శ్రీ కుందుర్తి వచనకవితని ఉద్యమస్ఫూర్తిగలదాన్నిగా భావించి, అభ్యుదయ భావకేంద్రంగా వచన కవితని సమగ్రం చెయ్యడానికి ప్రయత్నం చేశారు.

-పాతకాలం పద్యమైతే
వర్తమానం వచనగేయం -

అంటూ దృఢవిశ్వాసంతో వచన కవితా పరిణామానికి కృషిచేసి ఎంతో మందికి ఉత్తేజాన్నిచ్చారు.

1966లో వచన కవితా చైతన్యపు కట్టలు తెగిన ఆవేశంతోనూ, సమాజం పట్ల దిక్కులు తెలియని కసితోనూ, ఉన్మాది మనస్సునీ వాలిలో, ఘూకంకేకా, భేకంబాకా' లా ఆంధ్రదేశం మీద అక్షరాల్తో విరుచుకుపడ్డవారు దిగంబర కవులు భారతదేశంలోని యితర ప్రాంతాల్లోనూ, పాశ్చాత్య దేశాల్లోనూ, సంప్రదాయ విధ్వంసన ప్రధానంగా సాగుతున్న సాహిత్య సామాజిక సిద్ధాంతాల అసమగ్ర సమ్మేళనంతో, వచన కవితాచేతన ప్రధాన ధోరణిగా కవిత్వంరాసి, ఎంత అసంతృప్తిని కలిగించినా, ఎంత అసభ్యతనీ, జుగుప్సనీ సింపుకున్నా, ఒక స్ఫుటమైన నూతనోత్తేజాన్ని వెదజల్లింది దిగంబర కవిత. వ్యక్తివాదం, సమాజవాదం, కసీ,కన్నీళ్లూ మార్క్సిజం, ఎగ్జిస్టెన్షియలిజమ్, మానవతావాదం, మహోగ్రవాదం- యిత్యాదులన్నీ కలగా పులగమై పోయినై వీరి కవిత్వంలో. 'ఈ భూగోళంపై దారిద్ర్యం, ఆకలి అలుముకొని వున్నంత వరకూ మార్క్సిస్టు దృక్పథాన్ని సవాలుచేసే అధికారం ఎవరికీలే'దంటూ, "ఈ దశలో కత్తి అంచుపై కూడా మానవత్వాన్ని మరిచిపోనివాడు, అంతర్గత సంగీతాన్ని వింటూవుండేవాడు యధార్థమానవుడు" అంటారు దిగంబరకవులు దిగంబర కవిత్వాన్ని ఉద్యమం అని పేర్కొనడం కొంత మందికి యిష్టమైనప్పటికీ దాన్ని ఉద్యమ మనడం న్యాయం కాదు. నిర్దిష్టమైన భావ సమగ్రతగాని, సిద్ధాంత సంపూర్ణతగాని లేని దిగంబర కవిత, దిగంబర కవితే ఔతుందిగాని, ఒక ఉద్యమంకాదు. ఎన్ని దుర్లక్షణాలున్నా ఉత్తమ కవిత్వానికి కావలసిన ప్రవాహరూపమైన శైలీ, వ్యంగ్యోక్తిచాతుర్యమూ ఉండటంచేత దిగంబర కవిత్వం గుర్తింపు పొందగలిగింది. ఒక్క ఉదాహరణ చూడండి-

కాలకాంత సరసన
ఇరవయ్యో శతాబ్దం సౌరశయ్యన
సంక్లిష్ట సమస్యల పరిమళాల్ని ఆఘ్రాణిస్తూ
క్షణక్షణ సంఘర్షణతో రమిస్తూ

శుక్రేతర సర్వగ్రహాల సంకేతాలు వినిపిస్తాను
ప్రళయాల పొరల క్రింద నిశ్శబ్దాన్ని తెరిగిస్తాను.

మిగిలిన మహోద్యమాల్లాగా దిగంబర కవితకి అనుయాయుల సంప్రదాయం ఏర్పడ లేదు. దానికి కారణం అనిర్దిష్టమైన భావాలు అల్లకల్లోలంగా కథాకళి చెయ్యడమే.

1970లో ప్రారంభి పబడ్డ విప్లవ కవితోద్యమం దేశాన్ని దావాగ్నిలా చుట్టు కుంది. ఒక విధంగా చూస్తే సంపూర్ణమైన ఉద్యమ లక్షణం విప్లవకవిత్వానికే ఉన్న దని చెప్పాలి. సమాజంలో ఒక పోరాటం రగులుతున్నప్పుడు, ఆ పోరాటానికి సమగ్ర ప్రతిబింబమై ఆ చైతన్యాన్ని ప్రజల్లో రగిలించడమే ధ్యేయంగా సాగింది ఈ కవితోద్యమం. ప్రజలతోని ఒక చైతన్యంతో పూర్తిగా మమైక్యం పొందింది ఈ ఉద్యమమే. అందుకేయింతకు ముందు ఏ ఉద్యమానికిలేని ఒరిజినాలిటి దీని కున్నది. భావ కవిత నాటినుండి యితర భాషాకవిత్వాల అనుకరణ శృంఖలాల్నించి తప్పు కున్న కవిత విప్లవకవితే. అభ్యుదయ సామాజిక కవిత్వానికి ఆ కవి గురజాడ అప్పారావు తర్వాత, అనువాద దోషం తాకని కవిత విప్లవ కవితేననడంలో సందేహంలేదు.

అభ్యుదయోద్యమానికీ, విప్లవోద్యమానికీ మార్క్సిస్టు భావాలే పునాది. కాని, అభ్యుదయోద్యమం యొక్క వస్తు పరిధి విశాలమైనది. సామాజికమైన పురోగమ నమూ, వర్గచైతన్యమూ అభ్యుదయ కవిత్వానికి ప్రధాన లక్ష్యాలు. అందుకే ఆధుని కతని సర్వాత్మనాపరిగ్రహించింది. ఫ్రాయిడ్ మనోవిశ్లేషణని తిరస్కరించలేదు సరిహద్దులు దాటని కాల్పనికతని కాదనలేదు. కాని విప్లవ కవిత రాజకీయ పోరా టాన్ని మాత్రమే ప్రధానవస్తువుగా చేసుకుంది. రాజకీయ పోరాటం దృష్ట్యా మాత్రమే ప్రతి అంశాన్ని విశ్లేషించడం ప్రారంభమయింది. మనస్సులోని లోతుల్ని కాల్పనికత్వాన్నీ, ప్రయోగవాదాన్నీ, సంస్కరణ భావాన్నీ పూర్తిగా తిరస్కరించ డం ప్రారంభమయింది. కవితాశిల్పమనే మాటకి విప్లవ విమర్శకులు కావాలని విలువ నశింపజేసి, ఒక కవిని విమర్శించడమంటే, విప్లవపోరాటానికి ఇటూఅటూ అని మాత్రమేచూడ్డం మొదలయింది కేవలం దృక్పథాలే, రాజకీయ సిద్ధాంతాలే కవిత్వం అని భావించడంలో ఒక బలం ఉన్నది. ఒక బలహీనతా ఉన్నది. సిద్ధాంత ప్రచా రానికి కవిత్వం ఉపయోగ పడటం బలం ఔతుంది. ఏ సూక్ష్మాంశంలో అభిప్రాయ భేదం ఉన్నా దాన్ని అకవిత్వంగా తిరస్కరించడం బలహీనత ఔతుంది అందుకే విప్లవ వాదుల్లో కూడా రాజకీయాభిప్రాయాలలో ఏమాత్రం భేదం వచ్చినా, కవి త్వాన్ని గూర్చిన అభిప్రాయం కూడా మారిపోవడం మొదలుపెట్టింది. నిన్న కవిత్వ మైంది. నేడు కవిత్వం కాకుండా పోయింది. నగ్నముని మొదలైనవారి కవిత్వం గూర్చి మారుతూవచ్చిన అభిప్రాయాలు ఈ విషయాన్ని ఋజువుచేస్తే రాజకీయ

పోరాటాభిప్రాయాలు మాత్రమే కవిత్వానికి నికషోపలాలైనప్పుడు కవిత్వం అనుకొన్న ప్రజాజీవిత సమస్యలకి దూరమై పోతుంది. ప్రజాకవిత్వమనే భావానికి అతి సంకుచితమైన పరిధిఏర్పడుతుంది. కవితా శిల్పంలోని వైవిధ్యం మరుగునపడి, సాహిత్యానికి అతి ప్రధానమైన అనుభూతి పలచబడి పోతుంది ఎన్ని ఉత్తమ రచనలు విప్లవోద్యమంలో వచ్చినా, ఈ లోపాలు ముఖ్యంగాకనిపిస్తై విప్లవోద్యమం భావ వాహికగా వచనకవితని కాకుండా పాటను మాత్రమే ప్రధాన రూపంగా అంగీకరిస్తుంది. అంటే భావప్రచారమే లక్ష్యమనేది స్పష్టమౌతు ది,

1970 నుండి 1972దాకా ఉధృతమైన ప్రభావాన్ని యువతరం మీద చూపించింది విప్లవోద్యమ . రాజకీయ పోరాటాన్ని సమర్థించినా, సమర్థించక పోయినా, అతిగాఢ ఉగ్రవాద భావాలు రాయడం కవుల్లో సామాన్యమైపోయింది. కవిత్వానికి సూర్యుడు నాయకుడయ్యాడు. ఏమైనా, మార్క్సిస్టు భావాల్ని అవగాహన చేసుకోడానికి వ్యాసాలు చదవకుండా, కవిత్వం చదివితే చాలునన్నంతగా కవిత్వం రాజకీయ సామాజిక సూత్రాల్ని ప్రతిబింబించింది. ఆధునిక సాహిత్యోద్యమాల్లో విప్లవోద్యమం సమాజంలో కలిగించిన సంచలనం మాత్రం అపూర్వమైనదనడంలో సందేహంలేదు.

ఇట్లా ఆధునిక కాలంలో సాహిత్యం ఉద్యమాలుగా పరిణమించడం విశిష్ట విషయం. ఇది సాహిత్యానికీ సమాజానికీ ఉన్న సంబంధాన్ని, సామాజిక చైతన్యం లోని సమిష్టిశక్తినీ ఋజువు చేస్తుంది. సామాజిక పురోగతికి అవసరమైన కొన్ని భావాలు ఒక పరిస్థితికి చేరగానే, అవి కవులదృష్టినాకర్షించి కవిత్వంగా రూపొంది, సంఘంలోని భావ సంచలనానికి దోహదమౌతై. అందువల్ల సాహిత్యం ఉద్యమాల రూపంలో పెంపొందడం, సామాజిక చైతన్యానికి ఒక అత్యవసరమైన విషయం

విప్లవోద్యమం యొక్క విజృంభణ సాహిత్యంలో సన్నగిల్లిన తర్వాత పరిణామాన్ని పరిశీలిస్తే 1975 ప్రాంతాల నుండి వచనకవితారచనలో ఒక అపూర్వమైన స్పృహ కనిపిస్తోంది. కవిత్వపు విలువలతో కవితల్ని రాయాలన్న చైతన్యం యువకుల్లో బాగా ప్రజ్వరిల్లుతోంది. సామాజిక పురోగమనానికి అవసరమైన అభ్యుదయ భావాల్ని రాయాలన్న స్పృహ ప్రధాన చైతన్యంగానే ఉండగా, వ్యక్తిగత అంతరాంతర అనుభూతుల్ని ఆవిష్కరించే ప్రయత్నమూ కనిపిస్తుంది. ఏమి చెప్పినా ముందు ఉత్తమ కవిత్వంగా కనిపించాలన్న లక్ష్యం యువతరంలో బాగా దర్శనమిస్తోంది. మినీ కవితలకి బాగా ప్రాధాన్యం వచ్చి కవిత్వంలో వ్యంగ్య శక్తిని ఋజువుచేస్తోంది. ఆధునిక యుగంలో పితామహులైన కవులు అక్కడక్కడ చూపిన శిల్ప వైచిత్రి, ఈనాడు చాలా సులభంగా కనిపిస్తోంది. అందే థిక్ పొయిట్రీ, ఈ నాడు బాగా ప్రాధాన్యం వహిస్తోంది. ఐతే ఈ నేపథ్యంలో నుండి, ఎప్పుడు ఏ సామాజిక శక్తి ఉద్యమంగా రూపొందుతుందో, వేచిచూడివలసిందే!

# ప్రేమ్‌చంద్ రచనల్లో సందేశం

డా॥ రాజబహదూర్ గౌర్

ప్రేమ్‌చంద్, 31 జూలై 1880నాడు పుట్టి, 8 అక్టోబర్ 1936న అస్తమిం చాడు. అతను కలంపట్టింది. 1903 ప్రాంతంలో.

"అతను రచయితగా జీవితం ప్రారంభించిననాటికి దేశంలో ఎట్లాంటి పరిస్థితులు నెలకొనిఉన్నాయ్? 40 సంవత్సరాలుపైగా సాగిన అతని సృజనాత్మక సాహిత్య జీవితాన్ని ప్రభావిత చేసిన కారణాలేమిటి?

ఆతని సందేశం ఏమిటి? ప్రస్తుతందాని ప్రాముఖ్యం ఏమిటి?

ఇట్లాంటి ప్రశ్నలు, ప్రపంచవ్యాప్తంగా ప్రేమ్‌చంద్ శతజయత్యుంత్సవాలు చేపట్టిన సందర్భంలో తలెత్తడం సహజమే।

19 వ శతాబ్దపు చివరిదృశ్యాలు, సాంఘిక, సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమంరోజులు. ఇంగ్లీషు చదువుల ప్రభావంలో, దేశమంతటా తలెత్తిన కొత్తవర్గం- మధ్యతరగతి - మన సువిశాల, ప్రాచీన, భారతదేశ సాంఘిక సాంస్కృతిక రంగాలలో కలిగించిన గొప్ప కదలిక, ఈ ఉద్యమ విశిష్టత అనేక సంఘసంస్కరణోద్యమాలు తలెత్తింది కూడా ఆరోజుల్లోనే, ఈ పునరోజ్జీవనోద్యమ నాయకులు, సంఘంలో నెలకొనిఉన్న స్తబ్దతే। పశ్చిమ దేశాల దాడులను ఎదుర్కొలేక పోడానికి కారణభూతమైన బలహీనత అని భావించారు

ఇదే రోజుల్లో అనేక భారతీయ భాషల్లో కొత్త కొత్త సాహిత్యోద్యమాలు కూడా తలెత్తాయి. ఈ ఉద్యమాల లక్ష్యం వాడుకభాషకు దగ్గిరగా ఉండే ప్రామాణికమైన భాషను రూపొందించడం. బెంగాల్‌లో ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ఉత్తేజకరమైననాయకత్వం కింద జరిగింది ఇదే। తెలుగునాట వీరేశలింగం నాయకత్వం కింద జరిగిన ఉద్యమ ప్రధానలక్ష్యం కూడా ఇదే। సర్‌సయ్యద్‌అహ్మద్‌ఖాన్ నాయకత్వం కింద ఉర్దూలోనో, భరతేందు హరిశ్చంద్ర నాయకత్వం కింద హిందీలోనూ సాగిన ఉద్యమాల ముఖ్యలక్ష్యం కూడా ఇదే!

సరిగ్గా ఇదే రోజుల్లో అవతరించింది - కొత్త సాహిత్యప్రక్రియగా నవల కొత్త పద్ధతిలో పత్రికారచన ప్రారంభమైందీ అప్పుడే! సంస్కరణోద్యమాలకు అంకితమైన రచయితలు, వ్యంగ్యాన్ని హాస్యాన్ని ఆయుధాలుగా చేపట్టిందీ అప్పుడే।

వికృతమైన వస్తువుతో, మాటలగారడిగా ఉండిన సాహిత్యం పునర్జీవనోద్యమ నాయకుల చేతుల్లో నిర్దిష్టమైన లక్ష్యంతో బలమైన వస్తువుతో, రూపుదిద్దుకుంది. రచయితలు, కొన్ని ఆదర్శాలకు, ఆశయాలకు అంతం కావాలని ఉద్బోధితుల య్యారు.

గంగా, యమునా పరీవాహకమైన దానాల్లో, ఈ పునరుజ్జీవనోద్యమ పరిమితులూ, వెలుగునీడలూ ద్యోతకమయ్యాయి. ఒకవైపున సర్‌సయ్యద్ నడుపుతున్న అలీఘర్ ఉద్యమమూ, భారతేందు నడుపుతున్న సాహిత్యఉద్యమము, ఉర్దూ, హిందీ సాహిత్యాలను పునరుజ్జీవింపచేసేందుకు సాగుతూఉండగా, సాహిత్యం కొత్త తీరాలకు చేరుతూఉండగా, వచనం కొత్త ప్రాధాన్యతని సంతరించుకుంటూ ఉండగా మరొకవైపు ఇదేఉద్యమం తీవ్రమై. విషాదకరమైన పరిమితులకు, బాధలకుగుర య్యింది.

భాషా ప్రామాణికరణ సందర్భంగా, ఈ విశాలదేశపు. ఉర్దూ, హిందీ, భాషలు ఏకం కావడానికి బదులుచీలిపోసాగాయి. వాస్తవానికి ఈ రెండు భాషలూ, "ఖరీ బోలీ" అనే మాండలికం రెండురూపాలు. ఈ రెండింటికీ, ఒకటేభాషాజాలం ఒకటే వ్యాకరణం ఒకటే జన్మభూమిని. కానీ శాస్త్రీయ, సాహిత్యపదజాలం కోసం ఈ రెండు భాషలూ రెండు భిన్నమూలాలు స్వీకరించాయి. హిందీ సంస్కృత భాషని ఆశ్రయిస్తే, ఉర్దూపర్షియన్, భాషనాశ్రయించింది. హిందీ తత్సమ' పదాలను, తేలిగ్గా తనలోకి యిముడ్చుకోగలిగింది. కానీ ఉర్దూ తద్భవాలనూ, అపభ్రంశాలనూ మాత్రమే స్వీకరించగలిగింది. బహుశా, కశ్మీరీ, సింధీ, పంజాబీ భాషల్లో కూడా ఇలాగే జరిగిందనుకుంటా.

ఏమైనా, ఈ రెండు భాషలు ఇండో-ఆర్యన్ వంశానికి చెందినవే. రెండూ ఒకేచోట పెరిగి ఒకటే తరహా ఆచారాలను అలవరుచుకున్నాయి.

ఉర్దూ, హిందీలకు ఎన్నో పోలికలు ఉన్నా లిపికి సంబంధించి అవి విభేదిస్తాయి. అలాగే కొన్ని పదాలకు సంబంధించి అవి విభేదిస్తాయి.

విదేశపాలకులు, స్వదేశీఛాందసులూ, అభివృద్ధి నిరోధకులూ ఉర్దూ-హిందీలమధ్యన ఉన్న ఈ భేదాలను మరింతగా రెచ్చగొట్టారు, ఫలితంగా ఉర్దూ- హిందీ తగాదాతలెత్తింది దేశంలోని సాంస్కృతికరంగం కలుషితమైపోయింది. కవల పిల్లలవంటి హిందీ ఉర్దూలు ఒకదానికొకటి గోతులు తవ్వేందుకు పూనుకున్నాయి గర్భశత్రువుల్లాగా.

ప్రేమ్‌చంద్ కళ్ళుతెరచినప్పుడే కలం పట్టినప్పుడే విదేశపాలన తనప్రియమైన ప్రజల పైనా ముఖ్యంగా దారిద్ర్యంలో కుములుతున్న పేదరైతాంగంపైనా మోపబడి ఉందని గ్రహించాడు. మరొకవైపు సాహిత్యవాదులు హిందీ ఉర్దూ తగాదాలోపడి, బెనారస్ అలీఘర్‌వర్గాలుగా చీలిఉన్నారని గ్రహించాడు.

ప్రేమ్‌చంద్ తన జీవితాన్నంతా ఈ అంశాలకే అంకితం చేశాడు. ఇదే అతని రచనలో ప్రధానంగా చిత్రితమైనది కూడా

ప్రేమ్‌చంద్ హిందీ ఉర్దూ రెండు భాషల్లోనూ కథలూ నవలలూ రాయడం ద్వారా, రెంటికీ ఉన్న సామ్యాలను ఎత్తిచూపాడు. నా దృష్టిలో ప్రేమ్‌చంద్ సంస్కృతికి, సాహిత్యానికీ చేసిన గొప్ప సేవ-ఇదే. దీనికే ఆయన ప్రాతినిధ్యం వహించాడు

ప్రేమ్‌చంద్ నవలల్లోనూ, కథల్లోనూ ప్రధానంగా స్వీకరించిన వస్తువు, పేదరైతాంగపు జీవితం. బ్రిటిష్‌వారి దోపిడి ఫలితంగా శిథిలమైపోయిన జీవితాలు రైతాంగంలోనే నగ్నంగానూ అతితీవ్రంగానూ కన్పిస్తాయి. ఈ రైతాంగంలోనే భవిష్యత్తుకు బంగారుబాటలు నిర్దేశించిన వారూ జన్మించింది. గ్రామీణ జీవితాన్ని వస్తువుగా స్వీకరించడం ద్వారా, ప్రేమ్‌చంద్, అనైక్యంగా ఉన్న తత్కాలపు బుద్ధిజీవుల కళ్ళముందు విశాలమైన వాకిళ్ళను తెరిచాడు "పంచాయత్" బంకాజమీందార్" "అంధేర్ "మషాలేహిదాయత్' "బౌఘరాజ్ మొహిసిన్" "బడేర్‌కీబేటీ" "బంగేసహార్" "బేటీకాధన్" "ఆహెబేకాస్" ఖుర్బానీ" "ఖూన్-ఎ-సఫేద్" ఇచ్చతవాయివి, ప్రేమ్‌చంద్ గ్రామీణజీవితాన్ని చిత్రించిన కొన్ని కథలు అలాగే, "హజ్-ఎ-అక్బర్"," ఈద్-గాహ్," షత్రంజ్ కీబాజీ" మొ॥న కథల్లో మధ్యతరగతి జీవితాన్ని వస్తువుగా స్వీకరించినప్పుడు, మానవవిలువలను ఎత్తిచూపుతూ, మన జీవితాల్లో చోటుచేసుకొన్న కుళ్ళునూ బహిర్గతంచేస్తాడు.

ఈ సందర్భంగా, ప్రేమ్‌చంద్, సజ్జాద్ హైదర్‌యాల్దారమ్ ఇద్దరూ, కథానికకు కొత్త మలుపు ఇచ్చారనేది గ్రహించాలి. అప్పటివరకూ కథానికల్లో ప్రేమ, ధీరత్వాలను గురించిన కల్పన, మానవాతీత శక్తుల గురించిన కల్పనా ఎక్కువగా ఉండేది. వీళ్ళిద్దరూ కథానికను దివినించి భువికి దించారు- తన కాళ్ళపై తాను నిలబడేటట్లు చేశారు.

కానీ, ప్రేమ్‌చంద్, యాల్దారమ్‌లు యిద్దరూ రెండుభిన్నమైన సాహిత్య ధోరణులకు చెందినవారు. యాల్దారమ్ కాల్పనికవాదాన్ని ఆశ్రయిస్తే, పేమ్‌చంద్ వాస్తవికతావాదానికి వైతాళికుడయ్యాడు.

స్వయంగా ప్రేమ్‌చంద్ తనరచనల లక్షణాన్ని, లక్ష్యాలనూ "మేరే బెహతరీన్ అఫ్‌సాన్" "( నా ఉత్తమ కథానికలు)" పుస్తకం ముందుమాటలో నిర్వచించుకున్నాడు. అతనంటాడు- "నువ్వు గ్రామీణ జీవితాన్ని చిత్రిస్తున్నప్పుడు, పాఠకుడికి పేడవాసనా, ఊక తాలుకు ఉక్క, అనుభవంలోకి రాకపోయినంతకాలం -నీ చిత్రణ జయప్రదం అయినట్లు కాదు." యింకా——

"ఈ రోజున, నవలల్లో అడుగడుగునా, రచయితభావాలూ ఆలోచనాధోరణీ, శిక్షణా మనకు కనిపిస్తాయి. ఈ భావాలు ఎంత విశాలమైనవైతే, ఎంత నిర్దిష్టమైనవైతే, అంతగా అతన్ని మనం గౌరవిస్తాం". అంటాడు అంతే కాదు-

"చిన్న కథకు సాహిత్య విలువలతోపాటు, కాలక్షేపం చేసే లక్షణం కూడా ఉందని అందరూ గుర్తించినదే. సాహిత్యవిలువ లేమిటంటే, పాఠకుడిలో సున్నిత మైన అనుభూతులను రేకెత్తించడ, అతనిలో కల్తీలేని నిజాయితీని, నిస్వార్థాన్ని, న్యాయబుద్ధిని, మెలకొల్పడమూను" అని కూడా అంటాడు అదే ముందుమాటలో ప్రేమ్‌చంద్ యిలా అంటాడు.— "సాహిత్యంలో కథానిక ప్రముఖస్థానాన్నాక్రమించ డానికికారణం కథానిక ఊకదంపుడుపన్యాసంచేయకుండా, స్పష్టంగా ఒకసమస్య యొక్క కోణాన్ని చిత్రిస్తుంది. జీవనజ్యోతి చీకట్ని పారదోలి, మనల్ని మనం అర్థంచేసుకునేట్లూ, యితరులలో మనల్ని మనం చూసుకునేట్లూ, వారి కష్టాల్లో సుఖాల్లో పాలుపంచుకునేటట్లు చేస్తుంది"

అదీ, ప్రేమ్ చంద్ నిర్దేశించిన వాస్తవికవాదం.

ప్రేమ్‌చంద్ రాసినదేశభక్తిపూరితాలైన కథల సంకలనం "సోజేవతన్" విడుదలైంది — 1908లో. కానీ బ్రిటిష్ కలెక్టర్, ప్రేమ్‌చంద్ కళ్ళముందే, వాటిని "దేశద్రోహకరమైన సాహిత్యం"గా ఆరోపిస్తూ అగ్నికి ఆహుతి చేశాడు

ఈ సంఘటనను స్మరిస్తూ ప్రేమ్‌చంద్, "రాజకీయనాయకులు ప్రజల గమ్యాన్ని మార్పలే"రని ఉద్ఘాటించాడు. రచయితలు తమపాత్రనుతాము పోషించ వలసిఉంది. అలాకాకపోతే, ఆ కలెక్టర్‌కి పుస్తకాలను తగలపెట్టాల్సినపనేలేదు.

రచయితల ఈ పాత్రనే వివరిస్తూ. 1936లో, అభ్యుదయ రచయితల జాతీయ మహాసభ అధ్యక్షోపన్యాసంలో ప్రేమ్‌చంద్ యిలా అన్నాడు.

"అందాన్ని వీక్షించేమనం అన్ని కోణాలనూ చూడగల్గినపుడే, సాహిత్యంలో సౌందర్యం, శక్తి చిత్రితమవుతాయి".

రచయిత దేశభక్తి, రాజకీయాలను అనుసరించేవాడు కాదు — కాగడా తీసుకొని వాటికి మార్గనిర్దేశం చేసేవాడు"

ప్రేమ్‌చంద్ మేధ అట్లాంటిది!

---

# పాంచజన్యం

పరాన్న భుక్కులపై
శర పరంపరగా
నాకవిత్వాగ్నులను వర్షిస్తూ.
కలాన్ని గాండీవంగా
ధరించిన 'సవ్యసాచి' నేను
గళాన్ని పాంచజన్యంగా పూరిస్తున్న
'పరమాత్మను' కూడా నేనే!
సమధర్మసంస్థాపనార్థం
నిర్దేశించబడిన, నాకవితారుక్కులను
వినాదాలని నీవంటే
అది నీదృష్టిలోపమేగాని,
నసృష్టిలోపంకాదు.

— స్రవంతి

# తెలుగులో చేరిన ఉర్దూ, ఫారసీ, హిందీపదాలు

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి

ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రపంచలోని అన్ని భాషలకు విడదీయరాని సంబంధ వుంది. ఏజాతి రక్తం స్వచ్ఛమైంది? అని చరిత్రకారుణ్ణి అడిగితే ఏమని సమాధాన మొస్తుందో మనం ఊహించుకోగలం. మానవజాతి అంతా ఒక్కటే అనే సత్యాన్ని మానవుని భాష ఋజువు చేయగలుగుతుంది. సకల జీవుల్లో మానవుడు విశిష్టతను సంపాదించుకొన్నది భాషవల్లనే. తన నాగరకతా వికాసానికి నిత్యదర్పణంగా, తన అనుభవ సంపదకు భాండాగారంగా, తన హృదయానికి వాహికగా మానవుడు భాషను నిర్మించి అనుక్షణం దానికి క్రొత్త క్రొత్త రూపకల్పనలు చేస్తూ, మార్పులకూ, చేర్పులకూ సదవకాశాలు కల్పిస్తూ సంరక్షించుకుంటూ వస్తున్నాడు. ఐతే ప్రపంచ ప్రజల్లో భౌగోళిక, చారిత్రక పరిస్థితుల కారణంగా వైవిధ్యం కనిపిస్తుంది. ఆయా ప్రజాసమూహాల భాషలో కూడా కనిపించడం కూడా సహజమే. ఒక భాషలోని పదాలు మరో భాషలోకి ప్రవేశించడం, ఆభాషలోని పదాలను మృగ్యం చేయడం లేక పర్యాయపదాలుగా ప్రయుక్త కావడం ఆయా భాషల ఉచ్చారణకనుగుణంగా రూపుధరించడం నిజానికి అన్ని భాషల్లోనూ కనిపించే లక్షణాలు. పదాలు అంటే మాటలు మారుతూనే వుంటాయి. లేకపోతే అవి బ్రతకవు. మనిషి ముందు, తరువాత భాష. మనిషి మారుతుంటే భాష కూడా మారుతుంటుంది. భాష ఒక అవసరం. ఒక అలవాటు. మానవుడు తన అవసరాలకు సరిపోయే పద్ధతిలో దాన్ని మలుచుకుంటాడు. ఇతర భాషా ప్రజలతో సంబంధాలు కలిగినప్పుడు ఆప్రజల భాషా ప్రభావం నుంచి తప్పించుకో లేడు. భారత దేశంలోని భాషలన్నీ రెండు భాషా కుటుంబాలకు అంటే ఆర్య ద్రావిడ భాషా కుటుంబాలకు సంబంధించినట్టివి. స్థూలంగా ఉత్తర భారతంలో ఆర్యభాషలు, దక్షిణ భారతంలో ద్రావిడ భాషలు ప్రజాభాషలుగా వుంటున్నవి. ఉత్తర భారతంలోని భాషలన్నీ సంస్కృతం నుంచి విడివడినవే. సంస్కృతం అనేక ప్రాకృతాలుగా అవతారాలు దాల్చి, ఆ ప్రాకృతభాషలన్నీ నేటిహిందీ, గుజరాతీ, బెంగాలీ ఇత్యాది భాషలుగా ఇప్పుడు సమగ్రమూ, సుందరమూ స్వతంత్రమూ అయిన లక్షణాలతో ఉత్తమ సాహిత్య సృష్టికి సమర్థములై రూపొంది ఉన్నవి.

దక్షిణాది భాషలపై సంస్కృతభాషా ప్రభావం ప్రత్యక్షంగా ఉండనేఉంది. కాని పరోక్షంగా అంటే హిందీద్వారా కూడా సమధికంగా ఉన్నది. చాల పదాలు సంస్కృతంలోనుంచి హిందీలోనికి ప్రవేశించి, తిరిగిహిందీద్వారా తెలుగు

లోనికి ప్రవేశించినవి. ఈ క్రమంలో పరిశీలించిచూస్తే మనకెన్నో పదాలు తారసిల్లుతాయి. గోస్వామి అనే సంస్కృతపదం హిందీ'గుసాయీ'అయి తెలుగులో గోసాయిగా వచ్చింది.

ఉర్దూలో చాలా శబ్దాలు హిందీ భాషవే. ఉర్దూలో ప్రామాణికనిఘంటువుల్లో ఒకటైన ఫరహంగె ఆసఫియాలో 52వేల పదాలకు అర్థవివరణమున్నది. ఆ 52వేల పదాల్లో దాదాపు 40వేల పదాలు సంస్కృతంలో నుంచి హిందీద్వారా వచ్చినవే. ఉర్దూలోని క్రియలన్నీ హిందీవే. ట, డ, వర్ణనలూ, మహాప్రాణాలుఉన్న పదాలన్నీ హిందీవే. కనుక తెలుగులోనికి వచ్చిన ఫారసీ శబ్దాలు ఉర్దూ భాషావతరణానికి పూర్వం వచ్చినవి. మేకంజీ సిద్ధం చేయించిన కైఫియతుల్లో అనేక ఫారసీ శబ్దాలున్నవి. అంతకుపూర్వం తెలుగు వారికి అందిన రాయవాచకంలో ఫారసీ మాటల జాతర సాగనే సాగింది. పదిహేడో శతాబ్దానికి పూర్వం ఉర్దూ అంతగా వికసించలేదు. అప్పటికే తెలుగులోకి వచ్చిన ఫారసీపదాలు ఎన్నని చెప్పను? ఖుషీ ఫౌజు, కిల్లా, మజ్జా, సెబాసు, వంటివి చాలా ఉన్నవి. ఫారసీద్వారా ఎన్నోఅరబ్బీ శబ్దాలు తెలుగులోనికి వచ్చినవి. నిజానికి ఫారసీ, అరబ్బీనుంచి తెలుగులోనికి వచ్చిన పదాలు ఇప్పుడు ఉర్దూ నిఘంటువుల్లో మాత్రమే ఉన్నవి. తెలుగులో అవి తెలుగు వేషాలు వేసుకుని ఇంకా బ్రతికి ఉన్నవి. మన తెలుగు 'చౌకా' అరబ్బీ, చాఘా శబ్దభవం. ఉర్దు, హిందీ, ఫారసీ శబ్దాలు ఇలా చేరిపోవడానికి చారిత్రక కారణాలు ప్రబలంగా ఉన్నవనే సంగతి అందరికీ తెలిసిందే. తెలుగు పరిపాలనా భాషగా ఇప్పుడు గుర్తింపబడింది. విజయనగర సామ్రాజ్య పతనం నుంచి నేటి ఆంధ్రప్రదేశ్ అవతరణంవరకు ఈ ప్రాంతంలో గోలకొండనవాబులు, నిజాంనవాబులు, ఆంగ్లేయులుపరిపాలిస్తూవచ్చారు. దాదాపు350ఏళ్ళ పాటు తెలుగు కేవలం సాహిత్యభాషగా ఉండిపోయింది గాని, ప్రభుత్వభాషగా నేతృత్వం వహించలేదని చెప్పవలసి వస్తుంది. ఇంగ్లీషువారి పరిపాలనలో మనం ఎన్ని ఇంగ్లీషుపదాలను దిగుమతి చేసికొన్నామో కాదు?

ఇప్పుడే దినపత్రిక చూసినా, ఉర్దూ శబ్దాలు లేనిది మనకేది కనిపించదు రోజు, జవాబు, కులాసా, హామీ, జామీను, జుల్మానా, తాహతు, జల్సా, పుదాది, అసలు ఇత్యాది శబ్దాలే కాక కొన్ని పారసీకాంధ్ర సంధులు కూడా ప్రచారంలోకి వచ్చినవి. నిష్పేచీ – విష్పేచీ వంటివి. ఫారసీ శబ్దాలే కాక, ఫారసీ సమాసాలూ వచ్చినవి. 'బేషరతు' బందోబస్తు. ఆషామాషీ, బాతాకానీ వంటివి. ఇప్పటివి మనకు ఉర్దూ శబ్దాలుగానే తోచవు. నిన్నటిదాకా ఉర్దూలో పరిపాలన సాగిన తెలంగాణా ప్రాంతంలో కంటే ఇంగ్లీషు పరిపాలన సాగిన కోస్తా, రాయలసీమ ప్రాంతాలలో ఉర్దూ పదాలు అధికంగా ఉడటం ఒక విశేషం. తెలంగాణాలో ఉర్దూ పరిపాలకుల వరకే పరిమితమైపోయింది. సామాన్య ప్రజానీకంలోకి అది చొచ్చుకొని పోలేక

పోయింది, తెలంగాణాలో కూడా ఉర్దూలో పరిపాలన సాగింది దాదాపు 80 సంవత్సరాలే. అంతకు పూర్వం ఫారసీ రాజ్యం ఏలింది. కనుక ప్రభుత్వానికి సంబంధించి అనేక పదాలు యావదాంధ్ర దేశంలో చాలామట్టుకు ఫారసీలో ఉన్నవి. ముద్దాయి, సాలీనా, ఫసలీ, వకాల్తా, బేరీజు, ఫైసలా, కిమ్మత్తు, కుమ్మక్కు మున్నగునవి. ఇక హిందీ నుంచి వచ్చిన పదాలు, ఉర్దూ ద్వారా వచ్చినవే. హిందీ భాషా ప్రచారం ఇప్పుడిప్పుడు పుంజుకుంటున్నది.

తెలుగులో 'ఓణి' హిందీ ఓఢ్నీ శబ్ద భవం. ఇక బైఠాయించు, పురమాయించు, ఫిరాయించు, బనాయించు, వంటి క్రియలన్నీ ఉర్దూలో నుంచి వచ్చినవి. ఇప్పుడు సజీవమైన భాష ఈ క్రియలు లేనిదే ఉపయోగించడం కష్టసాధ్యమై పోతున్నది. నిఘంటువులో వేలపదాల మాట యెలావున్నా, నిత్యవ్యవహారంలోనలిగి పోతున్న అన్యదేశ పదాలు ముఖ్యంగా ఉర్దూ హిందీ ఫారసీ పదాలు చెప్పుకోదగిన సంఖ్యలోనే ఉన్నవని చెప్పవచ్చు. యావద్భారతంలో సంబంధ భాషగా హిందీ రూపొందుతున్న ఈ తరుణంలో ఉర్దూ హిందీ పదాలను తనలో జీర్ణంచేసుకుంటున్న తెలుగు, జాతీయ భాషా రంగంలో ప్రముఖ పాత్రనిర్వహింప గలుగుతుందనడంలో అత్యుక్తి లేదు.

---

## జర్నలిస్టు

విశాలమైన రంగస్థలంపైన
ఇతరులకు తెరలు లాగి
వాళ్ళను పేరుప్రతిష్టల వెలుగులో నిలిపి
తానుమాత్రం సైడ్ కర్టెన్‌లో కటికచీకటిలో
అజ్ఞాతంగా అనామకంగా అర్ధాకలితో నిలిచి
తన కన్నీటి కథలకు న్యూస్ వేల్యూ లేదనే
నిజం నిప్పును గుండెలో దాచుకుని
కుమిలి కుమిలి నవ్వేవాడు!

— ఏ. సూర్యప్రకాశ్

# తెలుగు కథానికలు

'శ్రీవిరించి'

అక్టోబరు అభ్యుదయ సంచికలో తెలుగు కథానికలపైని 'సర్వే' వ్యాసం చూచి చాల ఆనందించాను. ఇటువంటి పరిశ్రమ – యిది ఎంత పాక్షికమయినదని ఎవరు అనుకున్నాసరే – చాల అవసరం. ఈ రకమయిన 'సర్వే' చేయవలెనని నాకు చాల కాలంగా కోరిక వున్నప్పటికీ అందుకు తగినఅవకాశం, సమయవిరామం దొరకక నేను ఆపని చేయలేకపోయాను. ఇక మ చిపని ఎవరుచేసినా అభినంద నీయం గనుక; ఆ వ్యాసకర్తను మనసారామెచ్చుకుంటున్నాను.

మంచికథ అంటే ఏమిటి కథకువుండవలసిన లక్షణాలు యేమిటి, వుండ గూడని పద్ధతులు యేమిటి అనేవిషయం–ఎప్పుడూ వివాదాంశంగానేవుంటుంది. అలా వుండడమే సాహిత్య ప్రక్రియయొక్క అభివృద్ధికి అవసరంకూడాను.

తెలుగు కథానికలనుగురించి కొన్నికొన్ని సరికాని అభిప్రాయాలు వినిపిస్తూ వుంటాయి. వాటిని పాఠకుల మనసులనుంచి తుడిచివేయడం అవసరం. ఒకటి – తెలుగులో మంచి కథలు లేవు, మన కథకులు అందరూ ఇంగ్లీషుమీద ఆధార పడతారు అనేది.

రెండు–బోలెడన్ని కథలు వస్తున్నాయి. గాని చదవడానికి వీలయినవి, గుర్తుంచుకోవల్సినవీ బహుకొద్ది.

మూడు–మనకు కథల పత్రికలు చాల ఎక్కువ వున్నాయి. ఎక్కువ పత్రికలు వున్నందువల్ల–పేజీలు నింపడంకోసం చచ్చురకం కథలకు ఆధారం లభిస్తోంది.

నాలుగు–పత్రికల వాళ్ళకు పక్షపాతం వుంటుంది. వాళ్ళకు తెలిసిన రచయితల కథలే ప్రచురణ చేస్తారు.

అయిదు–కథవ్రాయడం చాల తేలిక. కాస్త అక్షరజ్ఞానం వున్న ప్రతివాడూ తీరుబడి దొరికినప్పుడు కూర్చుంటే, కథ వ్రాయగలుగుతాడు.

ఈ అభిప్రాయాలు కలవారితో 'యుద్ధం' చేయడం మనకు అసాధ్యం. కాని యివి ఎందుకు సరిఅయినవి కావో చెప్పడానికి ప్రయత్నం మాత్రం చేయగలం.

1. తెలుగులో మంచి కథలు లేవు అనడానికిముందు, యితర భాషలలో ఎటువంటి కథలు వస్తున్నాయి– వాటితో పోల్చిచూస్తే మన కథలు అంత తీసిపోయి నవా అనే విషయం ఆలోచించవలసి వుంటుంది. ఇతర భాషలలో–ప్రపంచం

మొత్తంమీద-ఎలాంటి కథలు తయారవుతున్నాయో మామూలు పాఠకులకు తెలుసుకునే అవకాశం అంతగా లేదు. అయితే "ఈనాడు" సంస్థనుంచి వస్తున్న "విపుల" మాసపత్రిక ద్వారా ఈ కొరత కొంతవరకు తీరుతుంది. అంతమాత్రంచేత ఆయా భాషలలో కథల ప్రమాణానికి, ఈపత్రికలో ప్రచురితం అయ్యే కథలనే ఉదాహరణలుగా తీసుకుందుకులేదు. ఈ పత్రికలవారికి వారి పరిధులు వారికి వుంటాయి. ఒక్కొక్కసారి ఈ పత్రికలో యితర భాషలోని కథ ఒక్కొక్కటి చదివినప్పుడు యిలాంటి కథనే తెలుగు కథకుడు వ్రాస్తే, మన తెలుగు పత్రికలు ప్రచురిస్తాయా అన్న సంశయం వస్తుంది. కథకులు యితర భాషల్లో జరుగుతూ వున్న కృషిని ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ వుండడం అవసరం. లేకపోతే కూపస్థ మండుకాలలా తయారవుతారు. కాకపోతే "కాపీ రచయితలు"గా తయారవకూడదు.

2. సమకాలిక సాహిత్యంలో ఎప్పుడూ "రాశి" ఎక్కువగానే వుంటుంది. దీనిలో "వాసి"ని ఎన్నుకోవడం కోసం సమగ్రమయిన కృషి జరుగుతూనే వుంటుంది. కాలం చేసే నిర్ణయాలను బట్టే యీ రచన నిలుస్తుంది. ఈ రచన నిలువదు అనుకుందుకు అవకాశం వుంటుంది గాని, వాటిపైని మనకున్న వ్యక్తిగత అభిప్రాయాలవల్ల కాదు ఎన్ని మంచి రచనలు కాలగర్భంలో కలిసి, యిప్పుడు అందుబాటులో లేకుండాపోయినాయి కావు? అలాగే, ప్రతి రచయితా "ఎగతిరచియించిరేవి సమకాలపువారలు మెచ్చరేగదా!" అని విలాపం చేయడానికీ అవకాశం వుంది

3. కథల పత్రికలు నిజంగా ఎక్కువగా వున్నాయా? జిల్లాకో పత్రిక చొప్పున వున్నాయా మనకు తెలుగులో? ముప్పైఏళ్ళ క్రిందట మూడు మాసపత్రికలు వుంటే - యిప్పుడు కనీసం ముప్పయి అయినా వుంటాయా? పత్రికల సంఖ్య పెరిగిపోయినదనుకోవటానికి మునుపు, జనాభా సంఖ్య పుస్తక ప్రచురణల అవసరం పెరిగిపోయిందన్న విషయం గూడా మనం గమనంలోనికి తీసుకోవాలనుకుంటాను. జనం పెరిగారు (సంఖ్యలో), వారి అవసరాలు పెరిగాయి. పత్రికలు అచ్చువేసే అవకాశాలు పెరిగాయి, విషయాలు వివరించి తెలియ పరచవలసిన అవసరంకూడ పెరిగింది. పత్రికల సంఖ్యలో పెరుగుదల యీ జనాభా యిత్యాది పెరుగుదలతో పోటీపడుతూ పెరిగిందా? లేదనే అనిపిస్తుంది.

పేజీలు నింపడం, ఎలాగోలా పత్రిక అమ్ముకోవడం పత్రికలవాళ్ళకు అత్యవసరం. అంతమాత్రంచేత వాళ్ళు 'చీప్' మెటీరియల్ అందిస్తారనిగాని చదువరులను మోసం చేయడానికి ప్రయత్నిస్తున్నారనిగాని అనుకోవడం వాళ్ళను సరిగ్గా అర్థం చేసుకోకపోవడం వల్లనే ననుకుంటాను. వాళ్ళ బాధలు వాళ్ళకు వుంటాయనిగాని, అవిగూడా తెలుసుకుని సహకరిద్దామనిగాని మనం ఎందుకు అనుకోగూడదు? నిజానికి కొంతమంది పత్రికాధిపతులు 'జనం యీ రకమయిన చీప్

మెటీరియల్'ను కోరుతున్నారు - బరువయిన విషయాలను పట్టించుకోవడం లేదు. అందుకనే మాకు ఎంత ఇష్టంలేకపోయినా కొన్ని చచ్చురచనలు చేర్చాల్సివస్తోంది మా పత్రికలలో' అంటున్నారు. చదువరులస్తాయిని పత్రికలస్తాయిని క్రమంగా పెంచడానికి ఎవరూ అభ్యంతరం తెలుపరనుకుంటాను.

4. పక్షపాతం వ్యక్తిగతమయినది కాకుండా రచనలకు సంబంధించినదే అయితే మనకు అభ్యంతరం యేమిటి? ఆడలేక మద్దెలమీద పడటంలాంటిదా యీ అభియోగం? "ఆశ్రితజన పక్షపాతం" మానవ స్వభావంలో పెద్ద ఎత్తునే చోటు చేసుకున్న, యిదే అంతటా ఆక్రమించుకు వుందనుకుందుకు లేదుగదా! తెలిసిన వాళ్ళవి ఎక్కువగా చేసినా తెలియనివాళ్ళని అంతమాత్రంచేత పక్కకు నెట్టరుగావే.

5. మంచి కథ అంటే ఏమిటో, కథాశిల్పం ఎన్నెన్ని మలుపులు తిరుగుతుందో పూర్తిగా తెలియక పోవడంవల్ల, కథలను గురించి కథకులను గురించి యిటువంటి చిన్నచూపు వస్తుంది. కథలను గురించి విమర్శా వ్యాసాలు, శిల్పాన్ని గురించి కాస్తోకూస్తో. ప్రామాణికమయిన రచనలు ఎక్కువగా ప్రచురణ భాగ్యం పొందితే యీ కొరత తీరుతుందనుకుంటాను.

పైన వివరించిన కారణాలు మాత్రమే గాకుండా యింకా ఎన్నో పరిస్థితుల వల్ల 'మంచి కథ' అనేది ప్రచురణ కాకుండా పోతుందేమో ఎవరికి తెలుసును? అసలు "మంచి కథ" రచయిత మనసులోంచి ఊడి పడుతుందా? పడిన తర్వాత అచ్చుపడుతుందా? దీనికి ఎంత ఓపిక, నిదానం, స్థైర్యం కావాలి!

---

# ఈ మనుషుల్ని చూసినప్పుడల్లా

చిన్న చిన్న అలల్తో అందంగా పల్కరించే సముద్రం
కోపంలో.......
ఉప్పెనై నిన్నూ, నన్నూ సమస్తాన్నీ కౌగలించు కోగలదు
ఈ గాలి -
ఎదురు తిరిగి తుఫానై
సర్వాన్నీ నాశనం చేయగలదు
నాకీ మనుషుల్ని చూసినప్పుడల్లా...
సముద్రమూ, గాలీ గుర్తురాక
బావీ, ఫ్యాన్ గాలీ గుర్తొస్తాయి.

— జింబో

# విమర్శ - తీరుతెన్నులు

— ఎ. బి. సాయిప్రసాద్

విమర్శకుడు, కవిలా హృదయంతో ఆలోచించక మేధతో ఆలోచిస్తాడు. రవి- కవి గాంచని కొత్త అందాలను, గుణదోషాలను, కొత్త కోణంలో చూడగల నేర్పరి కూడా విమర్శకుడే. కవి హృదయానికి అద్దంపట్టగల ఈ దిట్టను గురించి ప్రముఖ హిందీ భాషా తత్వవేత్త బాబూశ్యామ సుందర్‌దాస్ యిలా వ్రాశారు "యదిహమ్ సాహిత్యకో జీ.న్‌కి వ్యాఖ్యామానేతో ఆలోచనా (విమర్శ) కోఉస్ వ్యాఖ్యాకీ వ్యాఖ్యామాన్‌నా హోగా." ఇలాంటి భావాలనే ఆచార్యపింగళి లక్ష్మీకాంతం ["విమర్శకుడు కవిత్వం మీద కవిత్వం చెప్పెడి ప్రజ్ఞాశాలి"-సాహిత్య శిల్ప సమీక్ష-403వపుట] శ్రీ పురాణం సూరిశాస్త్రి ["విమర్శకుడు కూడా కవివలే అంతర్ దృష్టికల వాడగుటచే లోకుల కెఱుకపడని విశేషములోకవస్తువునందు విమర్శకునకు గోచరించును"- శ్రీముని మాణిక్యం నరసింహారావు గారి సంపాదకత్వంలో వెలువడిన యెస్సేస్ యిన్ తెలుగు -8వపుట] డాక్టర్ ముదిగొండ శివ ప్రసాద్ [కవిస్రష్ట అయితే సమీక్షకుడు ద్రష్ట - మహతి 259వపుట ] ఆదిగాగల పండితులు వెలిబుచ్చారు. అందరూ సాహిత్యంలో విమర్శకుడికి గల ప్రత్యేక స్థానాన్ని శ్లాఘించారు. వ్యాకరణంలాగానే విమర్శకూడా సృజనాత్మక సాహిత్యం వచ్చిన తరువాతనే వచ్చింది. కాని డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం ప్రకారం విమర్శ ముందు పుట్టి ఆ తరువాత తెలుగువాడు పుట్టాడట ('మహతి' 222వ పుట) కారణం విమర్శ సాహిత్యం యొక్క అంతర్భాగమనే విషయం తెలుగు వారు' మరచి పోవడమే. (ఈ ఆంధ్ర దేశంలో) సద్విమర్శ పట్ల అసహనం పెరుగుచున్నది. ఇతరులను విమర్శించుటకు జంకనివారు, ఇతరుల రచనలను విమర్శించుటకు తమకు అర్హత, హక్కు కలదని భావించువారు ఇతరుల విమర్శను సహింపలేకున్నారని 'భారతి' సంపాదకులు, 1964 జనవరి సంచిక స్వవిషయంతో తమ విచారాన్ని తెలియజేస్తారు. ఈనాటి విమర్శకులకు సంప్రదాయం తెలియదు, శాస్త్ర రహస్యాలు తెలియవు, గాఢశీలత్వం, బహుపరిశీలన లేదు (భారతి జూన్ 1966 58వ పుట) అని బాధను శ్రీతుమ్మలపల్లి రామలింగేశ్వరరావు వ్యక్తంచేయగా శ్రీ 'తిరునగరి' మనకున్న విమర్శాదీపం చిన్నదంటారు. (భారతి ఫిబ్రవరి 1977-లేఖలు). దీపం చిన్నదే అయినా కట్టమంచి, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ. పింగళి లక్ష్మీకాంతం , విశ్వనాథ, చలం, తాపీ ధర్మారావు, గిడుగు సీతాపతి, ఖండవల్లి, శ్రీశ్రీ, దేవులపల్లి, దివాకర్ల, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి. ఆర్.యస్.సుదర్శనం

కొడవటిగంటి, కె.వి. రమణారెడ్డి, మరపూరు కోదండరామరెడ్డిల కారణంగా కొంతంత వెలుగు నిస్తున్నది.

స్వాతంత్ర్యానికి ముందుకూడా మనకు అపారమైన విమర్శనా గ్రంథాలున్నాయి. అందులో 1893లో వెలువడిన శ్రీ గురజాడ శ్రీరామమూర్తి గారి 'కవి జీవితములు', 1895లో వెలువడిన శ్రీ వీరేశలింగం పంతులుగారి 'ఆంధ్ర కవుల చరిత్ర' ముఖ్యమైనవి. ఇవికాక శ్రీ సి.పి బ్రౌన్ ద్వారా అనేక గ్రంథాలు పరిష్కరింపబడి సాహిత్యపు వెలుగును చూడగలిగాయి. ఆ కాలంలో వెలువడిన విమర్శకు సంబంధించిన గ్రంథాలను సమీక్షిస్తూ ఆచార్య యస్.వి జోగారావు యిలా రాశారు ; పరిష్కర్తలు, విమర్శకులు వ్యక్తిగత వైమనస్యాలతో, పెక్కు దురభిప్రాయాలతో తమకు తోచిన పాఠాలను ఎన్నుకోవటం జరిగింది. అందువల్ల స్వాతంత్ర్యానికి పూర్వం వెలువడిన కావ్యాలన్నీ సమగ్ర పరిష్కరణలనీ, గ్రంథాలనీ, చెప్పటానికి వీలు లేదు. ("మహతి"- 229వ పేజీ). ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు'' నిన్న మొన్నటి వరకు యదార్థమైన విమర్శన రాలేదని, వచ్చినా ఆంగ్లేయుల సాంకేతిక విమర్శన (అబ్‌స్ట్రాక్ట్ క్రిటిసిజమ్)నే అవలంబించారని (సాహిత్యశిల్ప సమీక్ష) భావించగా, ఒక విసురు విసురుతూ డా|| శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారు - తెలుగువారికి వెక్కిరించడమూ, బూతులాడటమూ తప్ప హాయిగా నవ్వడం గురజాడ వారి 'కన్యాశుల్కం' వచ్చేవరకు తెలియదంటారు (భారతి, జనవరి 1964, 6వపుట) స్వాతంత్ర్యానికి పూర్వంవున్న విమర్శలో లోతు ఎక్కువగా వుండేది. దానికి బదులు 1947 తర్వాత లోతు బాగా తక్కువై వెడల్పు బాగా పెరిగింది. ఇది ముఖ్యంగా మనం గమనించ వలసిన పరిణామం అంటారు డా॥ ముదిగొండ శివప్రసాద్ (స్వాతంత్ర్యం తరువాత వచ్చిన విమర్శనాసాహిత్యాన్ని విమర్శిస్తూ, మహతి-290వ పుట). నేటి సమాజంలో కుల తత్వాలు, వర్గ సంఘర్షణలు, రాజకీయ పక్షాల ప్రభావం అటుకవులపైననే కాక ఇటు విమర్శకులపైకూడా ప్రత్యక్షంగా చూస్తున్నాం. అందుకే, ఇ ణాల ఇనుప సంకెళ్ళ నుండి స్వతంత్ర ప్రతిభ మరో స్వాతంత్ర్యోత్సవం కోసం ఎదురు చూస్తున్నదని 'మహతి' సంపాదకులు భావించగా, విమర్శసాహిత్యాని కంతటికీ విశ్వసనీయమైన సంక్షిప్త లేఖనం వంటిది అన్న ఆరోక్తికి మన సాహిత్య ప్రపంచంలో అంత పాటింపు ఉన్నట్లు కనిపించదని, నేటి విమర్శకులలోని లోటుపాట్లను శ్రీ చక్రపాణిగారు శ్రీ మధుసూదనంకు వ్రాసిన లేఖలో (భారతి, ఆగస్టు 1974, 17వ పుట) ఒక్కగా చర్చించారు.

ఆధునిక విమర్శలో అనేక మార్పు లొచ్చాయి. కొందరు మతపరంగా ఆలోచిస్తున్నారు. కొందరు మంచిని మాత్రమే చూస్తున్నారు. కొందరు ఇజాన్ని మరి కొందరు నిజాన్ని నమ్ముకొని రంగంలోకి దిగుతున్నారు. కొందరికి కావ్యం

ముఖ్యమైతే మరి కొందరికి కవి. ఏదియేమైనా నేటిసాహితీ కృషీ వలులు విమర్శను నాలుగు కాళ్లగా పండిస్తున్నారు. అవి– పరిశోధన, పీఠికలు, సమీక్షలు, చర్చా వేదికలు

పరిశోధన :-ప్రత్యేక దృక్పథం కలవారు సాహిత్యలో దాగివున్న సత్యాన్ని వెలికి తీస్తారు. ఈ ప్రక్రియనే పరిశోధన అంటారు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత వివిధ విశ్వవిద్యాలయాల స్థాపన కారణంగా దేశంలోని నాలుగు చెరగుల నుండి సాహిత్య పిపాసులు విరివిగా రావడం వల్ల స్నాతకోత్తర ప్రాంగణంలో పరిశోధన పగలు రెండింతలు రాత్రిపు నాలుగింతలుగా అభివృద్ధి పొందుతున్నది. శ్రీ దేవులపల్లి రామానుజరావు ప్రకారం పరిశోధనా ప్రక్రియకు మూలపురుషుడు శ్రీ మానవల్లి రామకృష్ణకవి వీరి తరువాత శ్రీ నిడదవోలు వెంకటరావు గారు స్టాటిస్టిక్స్ ఫాక్ట్స్ అండ్ ఫిగర్స్‌ను పరిశోధనలో జొప్పించి టైలర్ మేడ్ పరిశోధనా పద్ధతికి నాంది పలికారు. వీరుకాక డా॥ చిలకూరి నారాయణరావు, వాంగ్మయ చరిత్రకారులైన వంగూరి సుబ్బారావు, ఆచార్య ఖండవల్లి, గిడుగు సీతాపతి, ప్రత్యేక విషయాలకు సంబంధించిన పరిశోధనను ప్రారంభించిన విశ్వనాధభూపతి, లక్ష్మీనారాయణ, నండూరి కృష్ణమాచార్యులు, శాస్త్ర విషయకములైన పరిశోధనలకు శ్రీకారం చుట్టిన గంటిసోమయాజి, తల్లావఝుల, రాళ్ళపల్లి, నేలటూరి ముఖ్యులు. వీరుకాక ఆంధ్రప్రదేశ్ అకాడమీ వారు యం. శేషాచలం అండ్ కో వారు చేస్తున్న ప్రోత్సహిస్తున్న సేవలు ప్రశంసనీయమైనవి. ఈ ప్రక్రియలో కేవలం పరిశ్రమే మంచి ఫలితాలనిస్తుంది.

పీఠికలు – పూర్వకాలంలో కావ్యావతారికలు ఉండేవి. ఆ స్థానాన్ని నేటి పీఠికలు ఆక్రమించాయి. పరిష్కర్తలు తాము గ్రంధాలను ఎలా పరిష్కరించారో ఏయే సమస్యలను ఎదుర్కొన్నారో యిందులో రాస్తారు. కావ్యావతారికలలో లక్షణ చర్చమాత్రం వుండేది. కాని పీఠికలలో ఈ రోజు మనం లక్ష్య పరిశీలనను చూడగలుగుతున్నాం. ఈనాడు పరిష్కర్త లేక రచయితను గురించి తొలి పలుకులు, మున్నుడి, ఆముఖం, ఉపోద్ఘాతం, భూమిక, పేర్లతో ఇతరులురాస్తున్నారు. ఈ ప్రక్రియ ఎంతగా వికసించిందంటే కావ్యంకంటే పీఠికలే చక్కగా వుంటున్నాయి. పీఠికలు వ్రాసే వారిలో రాళ్ళపల్లి, విశ్వనాధ, బోయి భీమన్న, గుంటూరు శేషేంద్రశర్మ, కె. వీరభద్రరావు, ఆర్ యస్.సుదర్శనం ముఖ్యులు అప్పుడప్పుడు ఈ పీఠికలు వివాదాస్పదంగా కూడా తయారవుతున్నాయి.

సమీక్ష: అక్షరాస్యుల సంఖ్యబాగా పెరగటం మూలాన రచనా వ్యాసంగం చాలా వరకు వృత్తిగా మారింది. చదువరులు బుద్ధి మంతులవటం వల్ల, సమయాభావం వల్ల పుస్తక సమీక్షలు చదివి పుస్తకాలు కొనటం కాని మానేయాడం కాని చేస్తున్నారు. అందువల్ల సమీక్షకులకు గిరాకి బాగా పెరిగింది సంఖ్య పెరిగినంతగా స్థాయి పెరగడం లేదని అనేకుల భావన. కారణం సమీక్షలు సహే

తుకంగాను నిష్పాక్షికంగాను, ఆపోహలకు అతీతంగాను ఉండలేక పోవటమే. కొందరేమో పరస్పరం, ఒకరినొకరు పొగడు కోవటమే సమీక్షగా భావిస్తున్నారు. మన దృక్పధంలో మార్పు రానంతవరకు మనకు ఇలాంటి సమీక్షలు తప్పవు.

చర్చలు-లేఖలు :-వాదోపవాదాలు వివిధ పత్రికలలో అచ్చయిన విషయాల్ని గురించి సాధారణంగా చర్చలు వాదోపవాదాలు జరగడం సంపాదకుడికి లేఖలు వ్రాయడం ఈ నాడు సర్వసాధారణమై పోయింది. విశ్వవిద్యాలయాల్లో సెమినార్లు సాహితీ ప్రియులు సమావేశాలు. వ్యక్తిదూషణకు మాత్రమే ఈ రోజుల్లో పండితులు చర్చలను, లేఖలను వాడు కోవడం చాలా గర్హించాల్సిన విషయం కేవలం శబ్దప్రయోగాలనే తీసుకొని అసలు వ్యాసాన్ని వదిలేసి ఒకరిపై నొకరు కత్తులు దూసుకుంటున్నారు. సంపాదకులు ఇలాంటి వాటిని ప్రచురించకుండా వున్నప్పుడే చర్చలు శాస్త్రీయంగా ఉండగలవు.

తెలుగులో విమర్శ వెనుకబడ్డదని అందరూ అంగీకరించినా అంగీకరించకపోయినా ఒకటి మాత్రం నిజం. మనకు విమర్శకులంటూ ప్రత్యేక వ్యక్తులులేరు. అలాంటి వారు రానంతవరకు "సూర్యుడయితే వుదయిస్తాడుగాని కమలాలు వికసించవు". ఆ రోజుకై ఎదురుచూద్దాం.

---

# దండయాత్ర

పద పద
ఎద ఎద
చేద్దాం సోదా!

ఎదిగి పోయిన
వంచన ఎదుట
ఒదిగి పోయిన
మంచి నుదుట
కుంకుమను
ఉంచుదాం! వైధవ్యపు
సంకెళ్ళను త్రెంచుదాం!!

మోసాల మీసాలు
మెలివేసి
రుధిరాన్ని మదిరంగా
తల పోసి
చిత్తుగా తాగేసి
మత్తులో కనుమూసి
మానవత విలువల
వలువల నూర్చేసి
చెఱబట్ట నున్న
మానవత చెరనుంచి
మానవతను విడిపించగా!
సక్రమాన నడిపించగా!!

పద పద
ప్రతి ఎద
చేద్దాం సోదా!!

— టి. గౌరీశంకర్

# అభ్యుదయం — నవలా విశేష సంచిక

అభ్యుదయ 1980 జనవరి సంచిక (వచ్చే సంచికే) 1/4 డెమ్మీ సైజులో దాదాపు 200 పేజీలతో "ఈ దశాబ్ది తెలుగు నవల" ప్రత్యేక సంచికగా వెలువడు తుంది.

ప్రఖ్యాత సాహిత్య విమర్శకులు, నవలా రచయితలు, పరిశోధకులు, సాహిత్య సిద్ధాంతవేత్తలు, ఖమ్మం సదస్సుకు సమర్పించే విలువైన చర్చాపత్రా లన్నీ అందులో ప్రచురిస్తున్నాం. పరిమిత సంఖ్యలోనే ప్రచురిస్తున్నందున ఈ ప్రత్యేక సంచికలు విడిగా అమ్మడం సాధ్యంకాదు, డిసెంబరులో చందాలు అయిపోయినవారికి జనవరిలో చేరే కొత్తవారికి కూడా ఈ ప్రత్యేక సంచిక పంపడం సాధ్యపడదు. 1980 జనవరిలో జరిగే ఖమ్మం సదస్సులో ప్రతినిధులుగా పాల్గొనదల్చినవారు డిసెంబరు 15వ తేదీలోగా ఆ విషయం తెలుపుతూ 5 రూ॥ చొప్పున మని ఆర్డరును ఈ క్రింది చిరునామాకు పంపాలి.

గోర్కీ నర్సింగ్ హోమ్
వైరా రోడ్
**ఖమ్మం - 507001**

సదస్సులో పాల్గొనేవారి సౌకర్యార్థం డిసెంబరు నెలాఖరులోగాని జనవరి మొదటివారంలోగాని ముందుగానే ఈ పత్రికలు వారికి అందుతాయి.

ఏజంట్లుకూడా ఈ ప్రత్యేక సంచికలు ఎంత కావలసిందీ డిసెంబరు 15 లోగానే తెలుపుతూ తమ కమీషన్ మినహాయించుకొని డబ్బు పైన చెప్పిన అడ్రసుకే (ముందుగానే పంపాలి) గమనించ ప్రార్థన.

□ — □

## చందాదార్లకు మనవి

"అభ్యుదయ" నవంబరు, డిసెంబరు మాసాలకు కలిపి ఎక్కువ పేజీలతో ఈ సంచికను ప్రచురిస్తున్నాం. ఎన్నికల హడావుడివల్ల ఏ ముద్రణాలయంలోనూ పనిజరగక చాలా ఇబ్బంది ఎదుర్కొనవలసి వచ్చింది. అందువల్ల తప్పని పరిస్థి తిలో ఈ విధంగా ఒకే సంచికతో సరిపెట్టాల్సివచ్చింది. పాఠకులు, ఏజంట్లు మన్నించాల్సిందిగా ప్రార్థన.

"అభ్యుదయ" నష్టాలు ఎదుర్కొంటున్న పత్రిక అని మీకు తెలుసు ముద్రణ ఖర్చులు తలకుమించిపోయాయి. ప్రతి ప్రతిమీదా 50 పైసలు చొప్పున నష్టం వస్తున్నది. ఈ దశలో తప్పనిసరై కార్యవర్గ నిర్ణయంమేరకు నష్టాన్ని కొంతవరకైనా తగ్గించేందుకు విడిప్రతి వెలని రు. 1-50 పై॥లకు, సంవత్సరం చందా 12 రూ॥కు పెంచాల్సి వచ్చింది. 1980 జనవరినుండి కొత్తరేట్లు అమలు లోకి వస్తాయి. పాఠకులు, ఏజంట్లు సహృదయంతో అర్థం చేసుకుని ఎప్పటిలాగే సహకరించాల్సిందిగా కోరుతున్నాం.

గతంలో చందాదార్లకు కొత్తరేట్లమేరకు చందాలు సవరిస్తాము.



# ప్రచురణకర్తలకు మనవి

విశిష్ట సాహిత్య సిద్ధాంత పత్రికగా రచయితల పత్రికగా తెలుగునాట నిల్చిన అభ్యుదయ 1980 జనవరి సంచిక "ఈ దశాబ్ది నవల" విశేష సంచికగా వెలువడుతుంది. అమూల్యమైన సాహిత్య విమర్శన, పరిశోధనా,పత్రాలతో, నూతన రచయితల అభిప్రాయాలతో వచ్చే ఈ సంచికలో తమ ప్రకటనలను యిచ్చి తోడ్పడాల్సిందిగా నవలా ప్రచురణ కర్తలకు విజ్ఞప్తి చేస్తున్నాం.

మామూలుకన్నా పెద్ద సైజులో వేస్తున్నప్పటికి చిన్న ప్రచురణకర్తలకు కష్టం కాకూడదనే ఉద్దేశంతో విశేష సంచికలోకూడ మామూలు ప్రకటన రేట్లనే నిర్ణయించాం.

| | |
|---|---|
| చివరి కవరు పేజి | రూ. 500-00 |
| రెండవ లేక మూడవ కవరు పేజి | రూ. 400-00 |
| లోపల పూర్తిపేజి | రూ. 300-00 |
| లోపల అరపేజి | రూ. 200-00 |

[స్వయంగా ప్రచురించుకున్న రచయితలు, సాహిత్య సంస్థలు వెంటనే స్థలం రిజర్వు చేసుకొంటే. ప్రకటనల రేట్లపై 50 శాతం తగ్గింపు లభిస్తుంది. ఇవి లోపలి పేజీలకు మాత్రమే పరిమితం.]



# సరసం సప్తమ వార్షికోత్సవం – వారోత్సవాలు

సరసం సప్తమ వార్షికోత్సవ సందర్భంగా ఆరు రోజులు సదస్సులు, ఏడో రోజున వార్షికోత్సవ సభ జరిగాయి. ఈ సమావేశాలకు సరసం అధ్యక్షులు శ్రీ కొల్లూరి సూర్యనారాయణ మూర్తి అధ్యక్షత వహించారు. శ్రీ నడింపల్లి సోమ రాజుగారు వారోత్సవాలను ప్రారంభించారు. ముఖ్య అతిథులుగా శ్రీయుతులు బాలాంత్రపు శ్యామలరావు, కూచిమంచి సుబ్బరాజు, డా॥ యన్.యోగీశం, నంబూరి లక్ష్మీనరసింహరావు, డా॥ పలచోళ్ళ కొండలరావు, కుందుర్తి సభల్లో పాల్గొన్నారు.

శ్రీయుతులు శివలెంక ప్రకాశరావు, సోమయాజులు శర్మ, డా॥ చామర్తి కనకయ్య, శ్రీమతి వారణాసి జానకీదేవి, శ్రీ అద్దేపల్లి రామమోహనరావు, శ్రీ కె. శివారెడ్డిగారలు సభల్లో వక్తలుగా పాల్గొని విజ్ఞానదాయకమైన ఉపన్యాసాలు చేశారు.

సరసం 1978లో వెలువడిన వచనకవితాసంపుటాలలో అత్యుత్తమమైనదిగా ఎన్నికచేసిన "నేత్ర ధనస్సు" కవి శ్రీ కె.శివారెడ్డికి వార్షికోత్సవ సభలో షీల్డును, 116 రూ॥ల నగదు బహుమతిని సంస్థ అధ్యక్షులు శ్రీ కొల్లూరి అందచేశారు.

సంస్థ మాజీ అధ్యక్షులు శ్రీ పి వి.యస్.రాజును శ్రీ కుందుర్తి సన్మానించారు.

సంస్థ కార్యదర్శి శ్రీ చక్కా సూర్యనారాయణ మూర్తి సభల్లో పాల్గొని సహకరించిన వారందరికీ కృతజ్ఞతలు తెలియజేశారు.

సభల సందర్భంగా ఏర్పాటుచేసిన "తూర్పుగోదావరి జిల్లారచయితల ఫొటో ప్రదర్శన" ప్రత్యేక ఆకర్షణ.



# వికాస సాహితి స్థాపన

కరీంనగర్‌లో ఇటీవల సాహిత్యాభిమానులు కొందరు నవోదయ పాఠశాలలో సమావేశమై 'వికాస సాహితి' అనే సంస్థ స్థాపించారు. ప్రగతిశీల సాహిత్యాన్ని ప్రోత్సహించేందుకు, హేతువాద, శాస్త్రీయ, దృక్పథాలను ప్రచారం చేసేందుకు ఈ వేదిక అంకితమైంది. శ్రీ జి లింగారెడ్డిని ఈ సంస్థ కార్యనిర్వాహకులుగా ఎన్నుకొన్నారు. ప్రారంభ సమావేశానికి శ్రీయుతులు నవీన్, తాడిగిరి పోతరాజులు హాజరయ్యారు.



## సూర్యాపేటలో కవి-కథక సమ్మేళనము

సూర్యాపేట గ్రంథాలయ ఆవరణలో ఇటీవల కవి కథక సమ్మేళనం జరిగింది. దీనికి డా॥జిహెచ్, విశ్వనాథశర్మ గారు అధ్యక్షత వహించారు. తాలుకా పౌరసంబంధ శాఖాధికారి శ్రీ శేషాచారిగారు ముఖ్య అతిధిగా వ్యవహరించారు. శ్రీమతి వసుమతి మారుతీరావు, శ్రీ విక్రమార్క, యం.డి.నయీం, శ్రీ గుడిపాటి వెంకటేశ్వర్లు శ్రీ, దేవులపల్లి వెంకటేశ్వరరావు, శ్రీఅశోక్ శ్రీశేషాచారి గార్లు తమ కవితలు' కథలు వినిపించారు. లైబ్రేరియన్ శ్రీ రేపాక మధుసూదన్‌రెడ్డి గారి వందన సమర్పణతో సమ్మేళనం ముగిసింది.

□ .... □

---



---

Edited, Printed and Published by T Venkataramaiah, 3-6-737/3, Himayatnagar, Hyd-29
Printed at Nagarjuna Printing Works.